# కృష్ణాజిల్లా తెలుగు రచయితల

## 4వ మహాసభలు

మచిలీపట్టణం

1976 నవంబర్. 20,21.




...ందన సాహితీ సమాఖ్య



# శ్రీ మహావీర్ సేవింగు కార్పొరేషన్

(మెసర్సు మహావీర్ ఎంటర్‌ప్రైజెస్ అనుబంధ సంస్థ)

రిజిష్టర్డు నెం. 971/76-77

## సూర్యాపేట

(నల్లగొండ జిల్లా, ఆంధ్రప్రదేశ్)

హెడ్ ఆఫీసు :
నెం.15, ఫస్ట్‌ఫ్లోర్, యం.సి.హెచ్. బిల్డింగ్స్
**కోఠి, హైదరాబాద్ - 500.001**

బ్రాంచి ఆఫీసు :
27-23-249 గోపాలరెడ్డి రోడ్
**విజయవాడ - 2**

## ఆకర్షణీయమైన ప్రణాళిక

### "రమ" గ్రూపు : 45 మాసముల ప్రణాళిక

మా 1-వ గ్రూపు "రమ" 15,000 మంది సభ్యులతో ప్రారంభించబడును
మొత్తం బోనసులు 1 లక్ష రూపాయలు
మొత్తం బహుమతులు 3 లక్షల రూపాయలు

### సభ్యులు పాటించవలసిన నిబంధనలు

మా 1-వ "రమ" గ్రూపులో రూ. 15 లు చెల్లించి మీ పేరును నమోదు చేయించుకోనండి. ఇది మొదటి నెల రుసుము మాత్రమే
తరువాత 19 నెలల వరకు నెల 1కి రూ. 12 లు చెల్లించవలెను

*** Guaranteed by Canara Bank with Free Mail Transfer fecilities**

సిరి ఇంట గల గల లాడాలంటే

చేలో పంట కళ కళ లాడాలి

*

అన్ని రకముల రసాయనికపు ఎరువులకు

పురుగు మందులకు

ప్రతి మానవుడు ప్రతిరోజూ తెలిసీ తెలియని పాపాలెన్నో చేస్తూ వుంటాడు.

పాప నివారణకోసం ఎన్నో పుణ్యకార్యాలుచేస్తూ

దేవుని సంతృప్తిపరచటానికి ప్రయత్నిస్తూ వుంటాడు.

ఒక్క

**రత్నా దర్బారు బత్తి**

మాత్రమే

దేవుని త్వరగా తృప్తిపరుస్తుంది.

సుగంధ ప్రపంచంలో కొత్తరికార్డు సృష్టించిన

**“రత్నా దర్బారు బత్తి”**

చక్కని సువాసనలు భగవంతునికి ప్రీతికరం

మీరు కూడా వాడి చూడండి

**రత్నా దర్బారు బత్తి**

తయారు చేయువారు

**శ్రీ రత్నా ఇండస్ట్రీస్** (రిజిష్టర్డు)

**గాంధీ నగర్ - ఏలూరు,**

(పశ్చిమ గోదావరి జిల్లా)

జగపతి ఆర్ట్ పిక్చర్స్

పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు నటించిన

# బంగారు బొమ్మలు

ఈస్ట్‌మన్ కలర్

దర్శక నిర్మాత : **V. B. రాజేంద్ర ప్రసాద్, B. Sc.,**

శ్రీరాం రాజగోపాళం & బ్రదర్స్

జగ్గయ్యపేట

జగ్గయ్యపేట తాలూకా - కృష్ణాజిల్లా

మావద్ద అన్నిరకముల రసాయనికపు ఎరువులు

పురుగు మందులు సరసమైన ధరలకు లభించును

అన్నిరకముల రసాయనికపు ఎరువులకు

పురుగు మందులకు

శ్రీ ధాన్యలక్ష్మి ఏజన్సీస్

వత్సవాయి

జగ్గయ్యపేట తాలూకా - కృష్ణాజిల్లా

# వేదకాలంనాటి ప్రజా సంపద

పూర్వం ప్రతి మానవుడు తనను పాలించే రాజుపై ఆధారపడేవాడు. రాజులు ప్రజాక్షేమముకోరి కొన్ని యాగములు తలపెట్టేవారు. యాగములలో ముఖ్యమయిన పద్ధతి అందులో హోమము చేయటం. హోమములో ఋషులు నిర్ణయించిన ప్రక్రియ ప్రకారం హోమవస్తువులు హోమములో ఉంచి ఆ యొక్క ధూపముద్వారా భగవత్ సాక్షాత్కారము పొంది, కోరిన వరములు సిద్ధింపచేసుకొనే వారు. ఉదాహరణకు దశరథమహారాజు విష్ణువుని పుత్రునిగాను, జనకమహారాజు లక్ష్మినే పుత్రికగాను ( శ్రీరామునిగాను సీతగాను ) పొంది, ఆ హోమశక్తితో రాజ్యములు ఏలి, విశ్వాంతరాళములో విశ్వవిఖ్యాతకీర్తిని పొందియున్నారు,

ఈ ప్రజా రాజ్యములో ప్రజలే రాజులుగనుక అదే వేదసూత్రముల నాధారముగాచేసికొని ఆ హోమములో ఉపయోగించెడి వస్తువులతో తయారు చేసిన అంబికా దర్బార్ బత్తిని ప్రతివారు ప్రతినిత్యం తమ ఇష్టదైవమునకు తమ తమ గృహములలోను, వాణిజ్య సంస్థలలోను వెలిగించి ఆ పరిమళ ధూపమును భగవత్ కైంకర్యముచేసి, తమతమ కోర్కెలు సిద్ధింపచేసికొనవచ్చును. సామాన్య మానవులు సహితం తరించుటకు ఇది భగవత్ప్రసాదముగా భావించవచ్చును. సుగంధప్రియో విష్ణుః అనే నానుడి ప్రకారం అంబికా దర్బార్ బత్తి పరిమళం ద్వారా భగవంతుని ధ్యానించండి, తరించండి, ముక్తిని పొందండి.

## అంబికా దర్బార్ బత్తి తయారు చేయువారు




## అంబికా కెమికల్ ప్రొడక్ట్సు (రిజిష్టర్డు)

**ఫోన్: 216 పవరుపేట - ఏలూరు W. G. Dt.**

Grams :
"TEXMOTOR"

TEXMO

Phone :
PP 73347

# TEXMO INDUSTRIES

Mfgrs : Texmo Elec. Motors, Monoblocksets, Pumps & Sugarcane Crushers
( H. O. COIMBATORE - 29 Phone : 22307 )
Park Road, VIJAYAWADA - 520.001

---

MR
Phone: P.P: 73347

Phone :
PP 73347

# EMMAR INDUSTRIES

Mfgrs : Wet Grinders—Dry Grinders—Flexible Grinders—
Bench Grinders - Pedestal Grinders - Buffers - Spares
( H. O. & Factories : COIMBATORE - 11 )
TARAPET, VIJAYAWADA - 520 001

# VELUMANI ENGINEERING INDUSTRY

Mfgrs : Texvel Starters, Switches & Oil Engines
( H. O. & Factories : COIMBATORE - 34 )
12-4-2, Park Road, VIJAYAWADA - 520.001

15

ప్రత్యేక
సంచిక

# కృష్ణాజిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభలు

స్పందన సాహితీ సమాఖ్య (రిజిష్టర్డ్)
23/182 ఇ, న్యూ మునిసిపల్ క్వార్టర్స్
మచిలీపట్టణం-521001

1976 నవంబర్ 20, 21 తేదీలు
ముట్నూరి నగర్ (టౌన్‌హాల్)
మచిలీపట్టణం

ప్రత్యేకసంచిక సంఘము

శ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ (ఛైర్మన్)
శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి
శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ
శ్రీ తుమ్మల వెంకట్రామయ్య
శ్రీ ఆదివిష్ణు

# మహాసభల కార్యక్రమాల్లో పాల్గొన్న ప్రముఖులు

సర్వశ్రీ

ముసునూరు జగన్నాథరావు
పువ్వాడ శేషగిరిరావు
కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి
డి. వి. నరసరాజు
యస్. టి. జి. వరదాచార్యులు
కుప్పా శ్రీఆంజనేయశాస్త్రి
గురుజాడ రాఘవశర్మ
భాగవతుల కుటుంబరావు
జొన్నలగడ్డ నారాయణశాస్త్రి
డా॥ చలసాని సుబ్బారావు
అడ్దేపల్లి లక్ష్మణస్వామి
మల్లాప్రగడ శ్రీరంగారావు
దాసి బసవయ్యకవి
యర్రంశెట్టి శాయి
కొండముది శ్రీరామచంద్రమూర్తి
వెంపటి రాధాకృష్ణ
రామచంద్రకాశ్యప
పెద్దిభొట్ల సుబ్బరామయ్య
డి. సి. వెంకట సుబ్బన్న
కంభంపాటి సత్యనారాయణ
వి. వి. కృష్ణారావు
ఏ. యస్. అవధాని
ఎమ్వీయల్
అమరేంద్ర
డా॥ వి. వి. యల్. నరసింహారావు

అడ్దేపల్లి రామమోహనరావు
ఆర్వీయార్
నిడమర్తి ఉమారాజేశ్వరరావు
తుమ్మల వెంకట్రామయ్య
జి. వి. పూర్ణచంద్
ఆర్. యస్. సుదర్శనం
రామమోహనరాయ్
ఆదివిష్ణు
"హవిస్"
డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు
ఎక్కిరాజు మాధవాచార్యులు
తెనాలి శౌరి
పైడిపాటి సుబ్బరామశాస్త్రి
శనగన నరసింహశాస్త్రి
తెన్నేల ఎలీషా
కాకాని నరసింహారావు
రామసూరి
ఇంద్రగంటి శ్రీకాంత్‌శర్మ
శ్రీమతి లత
శ్రీమతి సి. సత్యవతి
శ్రీమతి ఐ. వి. యస్. అచ్యుతవల్లి
శ్రీమతి జంధ్యాల కిరణ్మయి M. A.
డా॥ కె. వి. కృష్ణకుమారి
కుమారి యం. హైమవతి
కుమారి ఐ. శిరీష



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి
కవిసామ్రాట్, పద్మభూషణ, కళాప్రపూర్ణ,
భారతీయ జ్ఞానపీఠ బహుమతి గ్రహీత

**డా॥ విశ్వనాథ సత్యనారాయణగారి**
**దివ్యస్మృతికి అంకితం**

**మండలి వెంకట కృష్ణారావు** హైదరాబాద్

విద్య, సాంస్కృతిక వ్యవహారాలశాఖామంత్రి
ప్రపంచ తెలుగు మహాసభల కార్యనిర్వాహక అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

.... మహా సభలు జయప్రదముగ నిర్వహించగలరని ఆశిస్తున్నాను.

— యం. వి. కృష్ణారావు

---

'కళాప్రపూర్ణ' 'కులపతి' చిట్టిగూడూరు
**శ్రీమాన్ యస్. టి. జి. వరదాచార్యులు** 11-11-76

విమర్శః కవితాచేతి
ద్వంద్వం యది సుసంగతమ్ !
ప్రసువీత రసం హృద్యం
సుమోదాయ సచేతసామ్ !!

—శ్రీ. తి. గు. వరదాచార్యః

**రావూరు వెంకట సత్యనారాయణరావు** హైదరాబాద్-29
అధ్యక్షుడు, భాషాకుటీరం

23-10-76

సాహిత్యమన్నా, సాహితీ బంధువులన్నా నా హృదయం స్పందిస్తుంది, బందరు పేరు చెపితే ముందుగానే స్పందిస్తుంది. అందులో – స్పందన సాహితీ సమాఖ్య అంటే ఎంతగా స్పందిస్తుందో చెప్పలేను. సమాఖ్యలో వారు అందరూ నాకు ముఖ్యులు; ముఖ్య సాహితీ సేవకులూ. వారందరినీ తలచినప్పుడు బందరు పరుగెత్తాలనీ; నావి అంత మెత్తని చేతులు కాకపోయినా, భాషా సరస్వతిపాదాలు పొత్తాలనీ అనిపించడంలో అతిశయోక్తి లేదు.

బందరు నాకు జీవిత ధర్మాన్నీ, కవితా ధర్మాన్నీ బోధించిన దివ్య సీమ. నా గురుపీఠం అక్కడిదే! నా గురుతర సేవకు నిలయం అక్కడే! బందరులో ఎన్ని వేల తొలి ప్రొద్దులు మేల్కొల్పి–నాకు కలాన్నీ, బలాన్నీ అందించినాయో; నాచేత ఎన్ని అక్షరమాలలు అల్లించినాయో. బందరుపట్టణానికి నేను చెల్లించలేని ఋణం ఎంతో వుంది. అందువల్ల నా జీవితాన్ని ఎప్పుడూ పణంగా పెట్టివుంచుతాను.

అలాంటి పట్టణంలో స్పందన సాహితీ సమాఖ్య చేస్తున్న సాహిత్య సేవను తలంచి పుష్పాంగిపోతూ వుంటాను. ప్రతి సభలో, సమావేశంలో ఒకమూల నక్కి వుండాలనుకుంటాను. చేతగాక పత్రికలద్వారా వార్తలు వింటూ వుంటాను. పువ్వాడ వారిలాగా నేను అక్కడ లంగరు వేసుకొని వుండలేకపోయాను. మీ సమాఖ్యలో చాలామంది ప్రముఖులున్నారు; ప్రసిద్ధులున్నారు; యువకులున్నారు; భావుకులున్నారు మీరు బందరు పట్టణాన్ని సాహిత్య పీఠంగా తీర్చి దిద్దడంలో చూపుతున్న సేవాభావానికి నా నమోవాకాలు !

మీ జిల్లా రచయితల మహాసభలు చల్లని వెన్నెలగా మారగలవనీ, భాషా సరస్వతిని తెల్లని మంచు దుప్పటులపైన నడిపించగలవనీ ఆకాంక్షిస్తున్నాను. ప్రక్కగా నడవడానికి నా కవితాత్మ నక్కడికి పంపుతున్నాను.

— రావూరు వెంకట సత్యనారాయణరావు

## కుందుర్తి

హైదరాబాదు

సంపాదకుడు : 'ఆంధ్రప్రదేశ్'

మహా సభలు జయప్రదమగు గాక.

— కుందుర్తి

---

## శీలా వీర్రాజు

హైదరాబాదు

కృష్ణాజిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభలు సాహితీ ప్రపంచాన్ని మరింత ప్రభావితం చేస్తాయని ఆశిస్తున్నాను.

— శీలా వీర్రాజు

---

## పతివాడ సూర్యనారాయణ

నంద్యాల

కమ్మర్షియల్ టాక్స్ ఆఫీసర్

స్పందన మహా ప్రస్థానంలో మరో ఘన విజయం కృష్ణాజిల్లా రచయితల మహాసభలు. శుభం !

— యస్. యన్. పతివాడ

## జి. వీరరాఘవస్వామి

ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్

హైదరాబాద్
28—10—76

సమాజ హృదయంలో రస ధ్వనులను స్పందింపజేస్తున్న "స్పందన సాహితీ సమాఖ్య" ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

కవిపండితులకు కాణాచియై, సాహిత్య రచనకు మూలకందమై వెలసిన మచిలీపట్టణం వన్నెవాసి నిలుపుతున్న స్పందన కార్యకర్తలను ఈ శుభసందర్భంలో ప్రశంసిస్తున్నాను. వారు మచిలీపట్టణంలో జరుపబోయే మహాసభలు దిగ్విజయంగా కొనసాగాలనీ, తక్కిన జిల్లాలకు ఆదర్శం కావాలనీ, "స్పందన" యావదాంధ్ర హృదయ స్పందనంగా స్పందించాలనీ మనసార వాంఛిస్తున్నాను.

— జి. వీరరాఘవస్వామి

---

## మల్లాది సూరిబాబు

మద్రాసు
12-10-76

మీ సమాఖ్య యింతవరకూ సాధించిన ఘనవిజయాలను చూసి చాలా ఆనందించిన బందరువారిలో నే నొకడిని. కీర్తి ప్రతిష్ఠలలో రవ్వంత కనుచాటు అవుతున్న మన నగరానికి యీనాటికి మీ హయాంలో మళ్ళీ అగ్రస్థానం లభించింది అంటే—అది మీ అందరి నిర్విరామకృషి, నిస్స్వార్థ సేవాఫలితమే.

మన జిల్లాలోని రచయితలు, రచయిత్రిలు ఒకచోట సమావేశమై సాహిత్య చరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభించే యీ శుభవేళ స్పందన సారథులకు, మిత్రులకు, ఆత్మీయులకు - శుభమస్తు - విజయోస్తు !

— మల్లాది సూరిబాబు

**Dr. Bezawada Gopala Reddi,**
President, A. P. Sahitya Academy

Nelluru - 3
13-10-1976

I send my best wishes for the success of Krishna District Telugu Writers' Conference to be held in November in Machilipatnam. This is the fourth time you are meeting and with your past experience of conducting conferences, I am sure this will prove a greater success.

Your publications are valuable contributions and are popular. I send my best greetings to 'SPANDANA' for all its literary activities

Wishing you every success.

—*B. Gopala Reddi*

---

**ఎం.ఆర్. అప్పారావు,** ఎం. ఏ.,
ఎం. ఎల్. ఏ., వైస్ ఛాన్సలర్, ఆంధ్ర విశ్వవిద్యాలయం

విశాఖపట్టణం—3
19—10—76

ఏ కాలంలోనైనా ప్రజల హృదయం స్వచ్ఛందంగా, అభ్యుదయగామిగా స్పందించటానికి సాహిత్యమే ప్రముఖసాధనం అనడంలో సందేహంలేదు. సాహిత్యంలో ప్రాచీనం, నవీనం — అనే పక్షపాతం అవసరం కాదు. ఏదైనా ప్రజాశ్రేయస్సుకు దోహదం కాగలిగితే అదే ఆదరణీయం.

ఈ భావాన్ని దృష్టిలో వుంచుకొని 'స్పందన సాహితీ సమాఖ్య' సర్వతోముఖంగా చక్కని కృషి సాగిస్తూ వుండడం సాహితీ సమారాధకులకు ఆనందాన్ని కలిగిస్తున్నది. కృష్ణాజిల్లా రచయితలు తమ లక్ష్యసాధనకై నిర్విరామంగా పాటుపడాలనీ, లక్ష్యాన్ని సాధించాలనీ ఆశిస్తున్నాను.

—యం. ఆర్. అప్పారావు

## దేవులపల్లి రామానుజరావు

కార్యదర్శి, ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ

హైదరాబాద్

12–10–76

స్పందన సాహితీ సమాఖ్య పక్షాన కృష్ణాజిల్లా రచయితల మహాసభలు 1976 నవంబరు 20, 21 తేదీలలో జరుపుతున్నట్లు తెలుపుతూ మీరు వ్రాసిన ఉత్తరము అందినది.

స్పందన సాహితీ సమాఖ్య కొన్ని సంవత్సరాలనుంచి చేస్తున్న ప్రశంసనీయమైన కృషి సాహితీప్రియు లందరూ గమనిస్తున్నారు. విశేషించి యీ సంస్థ పక్షాన ప్రకటించిన గ్రంథాలు తెలుగు పాఠకులను ఆకర్షించినవి.

ఈ కార్యక్రమాలకు తోడుగా యిప్పుడు కృష్ణా జిల్లా రచయితల మహాసభలను నిర్వహించడానికి పూనుకోవడము ప్రశంసనీయము. ఈ మహాసభల కొరకు మీరు నిర్ణయించిన కార్యక్రమము మనోహరంగానూ, వినోదదాయకంగానూ వున్నది. "స్పందన" వంటి సమర్థవంతమైన సంస్థ పక్షాన నిర్వహింపబడుతున్న యీ సభలు విజయవంతంగా, మార్గదర్శకంగా జరుగగలవని ఆశించుచున్నాను.

ఈ సందర్భంలో ఒక ప్రత్యేక సంచికను ప్రకటించడము ముదావహము. ఈ సంచిక సర్వాంగసుందరంగా, సాహితీ లోకానికి వెలుగు చూపించేదిగా ఉండగలదని ఆశిస్తున్నాను.

మీకూ, మీతోడి కార్యకర్తలకూ నా శుభాకాంక్షలు.

—దేవులపల్లి రామానుజరావు

---

## శివలెంక రాధాకృష్ణ

"ఆంధ్ర పత్రిక"

బెజవాడ

10-10-'76

మీ కార్యక్రమాలన్నీ బాగా నడవాలని కోరుకునే వాళ్ళలో నే నొకడిని.

—శివలెంక రాధాకృష్ణ

'కళాప్రపూర్ణ'

**డా. దాశరథి** (డి. లిట్)

మద్రాసు

14—10—1976

స్పందన సాహితీ సమాఖ్య తరఫున కృష్ణాజిల్లా రచయితల చతుర్థ మహాసభలు జరుగుతున్నట్లు తెలిసి పులకింత కలిగింది.

ఇలాంటి సభలు రచయితలలో నూతన చైతన్యాన్ని కలిగించడానికి తోడ్పడగలవు.

సభలు విజయవంతంగా జరుగుగాక!

స్పందనకు

అభినందన!

వందన పరంపర!!

—దాశరథి

---

**డా. సి. నారాయణరెడ్డి,** ఎం. ఏ., పిహెచ్. డి.,

ప్రొఫెసరు, ఉస్మానియా విశ్వవిద్యాలయం

హైదరాబాద్—20

—10—1976

# ప్రతి స్పందన

'స్పందన' పొందుతున్న సదావేశానికి సదా ప్రతిస్పందిస్తున్నాను.

చేసిన సభలూ, వేసిన పుస్తకాలూ, చేపట్టిన కార్యక్రమాలూ, తలపెట్టిన పథకాలూ— స్పందన సాహితీ సమాఖ్య అమందగతినీ, అశ్రాంత కార్యధృతినీ తెలియజేస్తున్నాయి.

సాహిత్యం అపరంజి మేడలనే కాదు; అడుసు గుడిసె గడపలనూ తడుతున్న కాల మిది. సాహిత్యానికి వ్యాప్తి, దీప్తి ఏర్పడ్డాయి ఇతోధికంగా. అక్షరాస్యతా విస్తృతి అందుకు దోహదకారి. ఈ అవకాశాన్ని సాహితీసాంస్కృతిక సంస్థలు సద్వినియోగం చేసుకోవాలి. ఉత్తమ పాఠకుల అభిరుచులకు మరింత తీక్ష్ణత, మరింత వ్యగ్రత అందించే సాహిత్య సృష్టికి సముచిత వాతావరణం సృష్టించాలి. రచయితల మహాసభలు ఇందుకు ఉపకరిస్తాయి.

స్పందన సాహితీ సమాఖ్య చేస్తున్న కృషికి మరోమారు అభినందనలు.

—సి. నారాయణ రెడ్డి

## మధురాంతకం రాజారాం

కోటాల
517102
(చిత్తూరుజిల్లా)

సాహిత్య సంచలనానికి మారుపేరు 'స్పందన'. చర్చలతో, సదస్సులతో, మంచి పుస్తకాల ప్రచురణలతో 'స్పందన' ఉనికి, 'స్పందన' సేవ - తెలుగు నేల నాలుగు చెరగులకు సువిదితంగా వుంది.

ఒకనాటి కృష్ణాపత్రికకు, జాతీయ కళాశాలకు, తెలుగు సంస్కృతీ వికసనానికీ తావలమైన మచిలీపట్టణంలో 'స్పందన' సారథ్యంక్రింద నిర్వహింపబడుతున్న కృష్ణాజిల్లా రచయితల మహాసభలు సాహితీ వసంతోత్సవాలుగా అలరారగలవని ఆశిస్తున్నాను.

—మధురాంతకం రాజారాం

---

## శ్రీమతి డి. కామేశ్వరి

భువనేశ్వర్—4

అనేక సభలు, సమావేశాలు, ఉత్తమ సాహిత్య ప్రచురణలు, నిర్వహిస్తూ అనేక సాహిత్యప్రియుల మనసులని స్పందింపజేస్తున్న 'స్పందన' అతి ఉత్సాహంగా కృష్ణాజిల్లా రచయితల సభలని నిర్వహించ పూనుకోవడం సంతోషాన్నిస్తుంది. ఈ సభలు నిర్విఘ్నంగా దిగ్విజయంగా జరగాలనీ, 'స్పందన' మున్ముందు యిలాంటి చైతన్యపూరితమైన కార్యక్రమాలు నిర్వహించాలనీ కోరుతూ ఈ శుభసమయంలో నా హృదయపూర్వక శుభాకాంక్షలు అందిస్తున్నాను.

—కామేశ్వరి

## OUR PATRONS



CHIEF PATRON

SRI MUSUNURI JAGANNADHA RAO, M. A., LL. B.



SRI T. UMAMAHESWARA RAO



Dr. B. K. RAJU, M. D.



Sri KURAPATI KRISHNA MURTY



Sri C. N. RANGASWAMY



Sri PURANAM VENKATA RAMAKRISHNA SASTRY



**Dr. G. L. PRASAD, M. S.**



**Dr. G. SUBRAHMANYAM, M, D.**

## OUR DONORS



Smt AKUNURI RAMAMANI &
Sri AKUNURI SREERAMACHANDRA RAO

10-384, Balaramanpet
Machilipatnam



Sri Md. ISMAIL



Dr T. KAMESWARA RAO, M. B , B. S.



Dr B. DHANWANTHARI ACHARY, M. B., B. S.

## Our Patrons

Chief-patron : శ్రీ ముసునూరి జగన్నాథరావు | మచిలీపట్టణం

| | |
|---|---|
| సర్వశ్రీ పురాణం వేంకట రామకృష్ణశాస్త్రి | ,, |
| డా॥ బి. కె. రాజు | ,, |
| చాపరాల బ్రహ్మానందరావు | ,, |
| దింటకుర్తి అచ్యుతరావు | ,, |
| తల్లాప్రగడ ఉమామహేశ్వరరావు | ,, |
| డా॥ జి. సుబ్రహ్మణ్యం | విజయవాడ |
| డా॥ జి. లక్ష్మీప్రసాద్ | ,, |
| కూరపాటి కృష్ణమూర్తి | ,, |
| సి. రామయ్య | గుంటూరు |

## Our Donors

| | |
|---|---|
| సర్వశ్రీ డా॥ దాలిపర్తి సుబ్బారావు | మచిలీపట్టణం |
| డా॥ ధన్వంతరి ఆచార్య | ,, |
| డా॥ డి. జగన్మోహనరావు | ,, |
| డా॥ టి. కామేశ్వరరావు | ,, |
| పి. రంగారావు | ,, |
| మహమ్మద్ ఇస్మాయిల్ (కల్పనాఛటర్జీ) | ,, |
| ఆకునూరి శ్రీరామచంద్రరావు | ,, |
| శ్రీమతి ఆకునూరి రమామణి | ,, |
| విజయవాడ మెషినరీ మర్చంట్స్ అసోసియేషన్, | విజయవాడ |
| శ్రీ వి. శ్రీరాములు | ,, |

---

**కృతజ్ఞతాభివందనాలు!**

---

# మహాసభల సందర్భంగా ఆర్థిక సహాయం అందించిన మిత్రులు

**మచిలీపట్టణం:** సర్వశ్రీ చలమలశెట్టి నాంచారయ్య; గుప్తా కుమార్ బ్రదర్స్; సూర్య అండ్ సన్స్: ప్రభల వెంకటరామశాస్త్రి; డా|| జి. వి. రాము; కె. మధుసూదనరావు; స్వదేశీ గోల్డు కవరింగ్ వర్క్స్; ఐ. కృష్ణమూర్తి; కె. ఎస్. ఎన్. శర్మ; పూర్ణ జ్యూయలరీ వర్క్స్; జి. ఆర్. కె. జగన్నాథరావు; వి. నిరంజనరావు; పి. రామ శేషగిరిరావు; జి. రామకృష్ణ; యక్కల పాండురంగారావు; పులవర్తి రామచంద్రరావు; యస్. రామారావు; కె. వాణీపతిశాస్త్రి; బి. గంగరాజు; సిహెచ్. సాంబశివరావు; ఏ. వీరభద్రరావు; యస్. రాధాకృష్ణమూర్తి; యం. కృష్ణకుమార్; జి. శేషగిరిరావు; యస్ రామకృష్ణ; సి ప్రభాకరరావు; టి. జోగేశ్వరరావు; పి. ఓం నమశివయ్య; మద్దాల రామచంద్రరావు; యం. ఆంజనేయశర్మ; యస్. హెచ్. యస్. ప్రసాదరావు.

**విజయవాడ** : సర్వశ్రీ వి. వీరేశలింగం, ప్రగతి నికేతన్, జే. భాస్కరరావు, వీనస్ వైన్స్, పాండురంగా ఇంజనీరింగ్ వర్క్స్, గొట్టుముక్కల అర్జునుడు, అరుణా పబ్లిషింగ్ హౌస్, అవ్వారు శ్రీకృష్ణమూర్తి, కారంపూడి వెంకటేశ్వరరావు. కారంపూడి శివరామకృష్ణయ్య, కె. లాల్‌మోహన్, గొట్టిపాటి మురళీమోహన్, యం. జగన్నాథరావు, భాస్కరరావు, వాసి రంగారావు, అనుపమా వైన్స్, ఓ. కె. టెక్స్‌టైల్స్, యం. ఆర్. యస్. రాజు, కె. రామమోహనరావు, మద్ది రంగనాయకులు.

సర్వశ్రీ కె. హరినాథబాబు, (గుంటూరు) అంబికా జ్యూయలరీ మార్ట్, (గుంటూరు) జి. జె. జేగ్, (పెడన), సిహెచ్. ప్రసాదరావు (తిరువూరు), యస్. కె. గౌస్ మొహిద్దీన్ (బంటుమిల్లి), కె. నాగేశ్వరరావు (మైలవరం), పి. నారాయణరావు (గన్నవరం), యం. నారాయణరావు (నందిగామ) ఆర్. తిరుపతిరావు (విస్సన్నపేట) వి. శ్రీమన్నారాయణ [తెనాలి], పి. సత్యనారాయణ [గుడివాడ], టి. సుబ్బారావు [గుడివాడ], యన్. వి. నరసింహాచార్యులు [గుడివాడ]

## కృతజ్ఞతాభివందనాలు!

# హార్దికంగా చేయూత నిచ్చిన మిత్రులు

**మచిలీపట్టణం :** సర్వశ్రీ టి. ఉమామహేశ్వరరావు. ముసునూరి జగన్నాధరావు, కూరాళ్ళ రామచంద్రరావు, బిహెచ్ వి. యల్. రాధాకృష్ణమూర్తి, సి. యస్. రంగస్వామి. వి. బి. యల్. నారాయణమూర్తి, ఏ. వి. కృష్ణమూర్తి. బి. సూర్య చంద్రరావు, యం. వి. భాస్కరశాస్త్రి, సి. బి. వి. నరసింహం, కనకమేడల మాధవరావు, జి. శేషగిరిరావు, కె. యస్. పాండురంగారావు, జిహెచ్. ఎస్. ఆర్. ఆంజనేయులు, మండల సత్యనారాయణమూర్తి, తాడేపల్లి సుబ్రహ్మణ్యం, మిరియాల సుబ్బారావు.

**విజయవాడ** : సర్వశ్రీ ఆర్. సంజీవరావు, పి.యస్. ప్రసాద్, శ్రీగోపాల్, నాగేశ్వరరావు డా. జి. సుబ్రహ్మణ్యం, పెద్దిభోట్ల సుబ్బరామయ్య, పిళ్ళా సుబ్బారావు, దీక్షితులు, సత్యనారాయణ, రామకృష్ణ, ఆదివిష్ణు, జి. వి పూర్ణచంద్, రాజశేఖరపాండే, ఊటుకూరు కృష్ణారావు, శ్రీమతి పి. సత్యవతి.

**గుంటూరు** : సర్వశ్రీ పి. శ్రీనివాసరావు, పి కృష్ణారావు, పి. వి. రంగాచార్యులు జే. రామమూర్తి, చలమయ్య, అమరలింగప్రసాద్, యస్. రాధాకృష్ణరావు., కోట వెంకటేశ్వరరావు.

........సర్వశ్రీ పి. పూర్ణచంద్రరావు [నరసరావుపేట], సి. కమలాకర్ [బొంబాయి] పతివాడ సూర్యనారాయణ [నంద్యాల], టి. లక్ష్మీనారాయణ [చిలకలూరిపేట], ఎమ్వీయల్ [నూజివీడు], కె. వీరభద్రశాస్త్రి [గుడివాడ] బి. యోగనాథ్ [గుడివాడ] టి. పి. గుప్త [చిలకలూరిపేట], వి. శ్రీరంగరాజు [చిలకలూరిపేట] పవని శ్రీధరరావు [మొగిలిచర్ల], బిహెచ్. శ్రీరామచంద్రమూర్తి [ఏలూరు], చొప్పరపు సుబ్బారావు [పుయ్యూరు], బి. యస్. అవధాన్లు [రాజమండ్రి], యస్ కె. మెహబూబ్ [ద్రోణాచలం], పి. వి. చలపతి [నంద్యాల], కె. ఆంజనేయులు [నంద్యాల], సుబ్బారాయుడు [ఆళ్ళగడ్డ], వీరబ్రహ్మచారి [కర్నూలు], మహమ్మదు రసూల్ [ఆదోని]. కిరణ్ [కంకిపాడు], జే. అమ్మలయ్య (తెనాలి) పువ్వాడ బాపిరాజు (హైదరాబాద్)

---

## కృతజ్ఞతాభివందనాలు!

---

# కృష్ణాజిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభలు

ఆహ్వాన సంఘము

సర్వశ్రీ కవిపాదుషా పువ్వాడ శేషగిరిరావు (చైర్మన్)
పెదసింగు లక్ష్మణరావు M. L. A.
కొల్లూరి కోటేశ్వరరావు M. L. C.
చాపరాల బ్రహ్మానందరావు
పురాణం వేంకట రామకృష్ణశాస్త్రి
దింటకుర్తి అమృతరావు
పి. రంగారావు
నాదెళ్ళ పురుషోత్తమకవి
డా॥ దాలిపర్తి సుబ్బారావు
డా॥ బి. కె. రాజు
డా॥ బి. ధన్వంతరి ఆచార్య
యం. వి. భాస్కరశాస్త్రి
జి. ఆర్. మోహనకృష్ణమూర్తి
సిర్విశెట్టి సత్యనారాయణ
విద్వాన్ మల్లాప్రగడ శ్రీరంగారావు
కవిశేఖర గురుజాడ రాఘవశర్మ
జి. వి. గున్నయ్యచెట్టి
వి. యస్. కృష్ణమూర్తి
కె. యస్. వి. కె. శాస్త్రి
విడియాల చంద్రశేఖరరావు
వి. వి. టోన్‌పే
గుడివాడ రామచంద్రరావు
తాడేపల్లి బసవయ్య
టి. యల్. కాంతారావు
స్వర్ణ రాజ హనుమంతరావు
భాగవతుల కుటుంబరావు
జొన్నలగడ్డ నారాయణశాస్త్రి
కాజ వేంకట లక్ష్మీనరసింహారావు
వై. వి. రమణరావు
ఏ. యస్. అవధాని
కొడాలి పట్టాభిరామయ్య
యం. వి. నారాయణరావు
వేములపల్లి చంద్రశేఖరరావు
కూరాళ్ళ రామచంద్రరావు
సి. యన్. రంగస్వామి
భావరాజు నరసింహారావు
యం. వి. సుబ్బారావు (ఎమెస్కో)
అద్దేపల్లి లక్ష్మణస్వామి
నందివాడ జగన్మోహన గణేశ్వరరావు
కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు
మండల సత్యనారాయణమూర్తి
చైతా మధుసూదనశాస్త్రి
కాజ రామలింగేశ్వరరావు
డి. వాసుదేవరావు
యం. భోగీప్రసాద్
డా॥ కుప్పా వెంకటాద్రిశాస్త్రి
ఉషశ్రీ
అడుసుమిల్లి పూర్ణచంద్రరావు
కవిసామ్రాట్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
ద్వారం భావన్నారాయణరావు
యత్ఞోజు మాధవాచార్యులు
డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు
నండూరి రామమోహనరావు
వీరాజీ
రెంటాల గోపాలకృష్ణ
హరికిషన్
జి. యస్. ఆర్. ఆంజనేయులు
కె. టి. యల్. నరసింహాచార్యులు
శ్రీమతి లత
,, కె. వసుంధరాదేవి
,, ఇంద్రగంటి జానకీబాల
,, పి. దుర్గాకుమారి
,, వేమూరి లక్ష్మీశారదాదేవి
,, బుద్ధరాజు సులోచన

## కార్యక్రమ నిర్ణయ సంఘము

సర్వశ్రీ కె. వీరభద్రశాస్త్రి (ఛైర్మన్)
ఎమ్వీయల్
పెద్దిభొట్ల సుబ్బరామయ్య
నిడమర్తి ఉమా రాజేశ్వరరావు
హవిస్

## ఆర్థిక సంఘము

సర్వశ్రీ టి. ఉమామహేశ్వరరావు (ఛైర్మన్)
పి. జగన్మోహనరావు
యల్. యస్. రామయ్య
ఇ. జగన్మోహనరావు
రెంటాల సంజీవరావు
విన్నకోట పూర్ణచంద్రరావు
ఆర్. డి. యల్. నరసింహమూర్తి
కనకమేడల మాధవరావు
కొల్లూరి రామకృష్ణరావు
పి. వి. రామారావు
ఏ. వి. కృష్ణమూర్తి
యం. వెంకటేశ్వరరావు
ఏ. వి. యస్. ఆర్. ఆంజనేయులు
బి. యోగనాథ్
పాగోలు నవోదయం
కూరపాటి కృష్ణమూర్తి
శ్రీమతి పి. సత్యవతి

## ప్రతినిధి ఆతిథ్య సంఘము

సర్వశ్రీ బి హెచ్.వి.యల్. రాధాకృష్ణమూర్తి (ఛైర్మన్)
బి హెచ్. నరసింహమూర్తి
పి. ఆర్. మోహనరావు
యస్. హెచ్. యస్. ప్రసాదరావు
పోమంచి రామం
గుడిసేవ సుందరరామయ్య
వందం రామారావు
వి. బి. యల్. నారాయణమూర్తి
మహమ్మద్ ఇస్మాయిల్ (కల్పనాఛటర్జీ)
ఏ. యస్. రామచంద్రరావు
కుమారి ఓ. వి. అన్నపూర్ణ ('శ్రీలక్ష్మి')

## ప్రత్యేక సంచిక సంఘము

సర్వశ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ (ఛైర్మన్)
సింగరాజు రామమచంద్రమూర్తి
ఆదివిష్ణు
ఇంద్రగంటి శ్రీకాంత్‌శర్మ
తుమ్మల వెంకటరామయ్య

## సాంస్కృతిక కార్యక్రమ సంఘము

సర్వశ్రీ డి. సీతారామయ్య (ఛైర్మన్)
నందూరి సుబ్బారావు
సి. యస్. నారాయణ
ఐ. కె. అయ్యవార్
జి. ఆర్. కె. జగన్నాధరావు

## ప్రచార నిర్వహణ సంఘము

సర్వశ్రీ బి. సూర్యచంద్రరావు (ఛైర్మన్)
పిడుగు రామలింగయ్య
వి. ఆంజనేయశాస్త్రి
లితో కృష్ణమూర్తి
యస్. ప్రభాకరరావు
భాస్కరశర్మ
పిళ్ళా సుబ్బారావు (గీతా ఆర్ట్స్)

## ప్రాంగణ నిర్వాహక సంఘము

సర్వశ్రీ పి. యల్. నరసింహం (ఛైర్మన్)
యం. ఏ. వి. ప్రసాదరావు
యం. అగస్త్యప్ప
ఐ. కృష్ణమూర్తి
ఐ. వి. రావు
వై. జె. సోమేశ్వరరావు
జే. రాధాకృష్ణ
కలపటపు రామకృష్ణారావు
కె. కైలాసపతి
రెడ్డి పురుషోత్తం
చింతా హనుమంతరావు
కొలగాని మోహనరావు
సి. మాధవరావు
పి. వి. శాస్త్రి
కుమారి ఏ. శోభ




# స్పందన సాహితీ సమాఖ్య

## కార్యనిర్వాహక వర్గము

అధ్యక్షుడు

టి. నారాయణమూర్తి (శాలివాహన)

ఉపాధ్యక్షులు

ఏ. ఆర్. బాబూరావు

శ్రీమతి అక్కాల సరస్వతీ బాబూరావు

ప్రధాన కార్యదర్శి

జే. ఎస్. మూర్తి (విహారి)

కార్యదర్శి

పువ్వాడ తిక్కన సోమయాజి

కోశాధికారి

డా॥ బి. రామారావు

సంయుక్త కార్యదర్శులు

బూదరాజు శ్యామసుందర్

వై. జి. కె. ప్రసాద్

కార్యవర్గ సభ్యులు

కె. యోగేశ్వరరావు

టి. త్యాగరాజు

పరిమి కృష్ణమూర్తి

ఇంద్రగంటి వెంకటరావు

యం. రామలింగేశ్వరరావు

యం. ప్రభాకరరావు

కన్వీనర్

గుత్తికొండ సుబ్బారావు

## గౌరవ సలహామండలి

కవిపాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావు

డా. సి. నారాయణరెడ్డి

కళాప్రపూర్ణ డా. దాశరథి

శ్రీ కుందుర్తి

శ్రీ మధురాంతకం రాజారాం

శ్రీ శీలా వీర్రాజు

శ్రీ జి. వీరరాఘవస్వామి

శ్రీ పతివాడ సూర్యనారాయణ

శ్రీ లంకా సుందరరామయ్య

శ్రీమతి డి. కామేశ్వరి

Hon. Auditor

**Sri M. A. V. Prasada Rao**

43

## స్పందన బంధువులు

| | |
|---|---|
| సర్వశ్రీ ఇంద్రగంటి వెంకట్రావు | మచిలీపట్టణం |
| రెంటాల సంజీవరావు | విజయవాడ |
| మహమ్మద్ ఇస్మాయిల్ | మచిలీపట్టణం |
| ఆర్. కె. నరసింహారావు | విశాఖపట్టణం |
| కె. యస్. వి. కె. శాస్త్రి | మచిలీపట్టణం |
| బి. యస్. ఆర్. ఆంజనేయులు | ఒంగోలు |
| సి. నారాయణరావు | మచిలీపట్టణం |
| పి. జగన్మోహనరావు | ,, |
| తల్లాప్రగడ ఉమామహేశ్వరరావు | ,, |
| సి. యన్. రంగస్వామి | ,, |
| చాపరాల బ్రహ్మానందరావు | ,, |
| పి. యస్. యన్. శాస్త్రి | హైదరాబాద్ |
| ముసునూరి జగన్నాధరావు | మచిలీపట్టణం |
| దింటకుర్తి అచ్యుతరావు | ,, |
| జి. ఆర్. కె. జగన్నాధరావు | ,, |
| ఐ. కృష్ణమూర్తి | ,, |
| పి. వి. ఆదిశేషు | ,, |
| సోమంచి యజ్ఞన్నశాస్త్రి | బొంబాయి |
| పరుచూరి నాగేశ్వరరావు | విజయవాడ |

## స్పందన మిత్రులు

| | |
|---|---|
| సర్వశ్రీ దోరడ్ల రాధాకృష్ణమూర్తి | మచిలీపట్టణం |
| చిలకమర్తి సత్యనారాయణ | ,, |
| కనకమేడల మాధవరావు | ,, |
| డి. ఆర్. యస్. డి. రాజారావు | ,, |
| డి. సీతారామయ్య | ,, |
| వి. శ్రీనివాసగుప్త | వేటపాలెం |
| సిహెచ్. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి | అద్దంకి |
| యస్. హెచ్. యస్. ప్రసాదరావు | మచిలీపట్టణం |
| డి. వి. సుబ్బారావు | ,, |
| కె. యస్. యన్. శర్మ | ,, |
| పి. వి. సుబ్బారావు | ఏలూరు |
| మాజేటి సుబ్బారావు | మచిలీపట్టణం |
| యస్. సుబ్బరామయ్య | ,, |
| యం. రామలింగేశ్వరరావు | ,, |
| పి. యం. యం. కె. అవధాని | ,, |
| బి. శంకరశాస్త్రి | ,, |
| టి. బి. సి. రామమోహనరావు | మచిలీపట్టణం |
| పి. సి. శాస్త్రి | ,, |
| ఆర్. కొండయ్య | ,, |
| ఆర్. అయ్యపరాయుడు | ,, |
| పత్రి రామ శేషగిరిరావు | ,, |
| మల్లాప్రగడ ప్రభాకరరావు | ,, |
| డా॥ మొగిలిశెట్టి సుబ్బారావు | ,, |
| కొండిపర్తి వీరబ్రహ్మం | ,, |
| చిట్టా గోపాలకృష్ణమూర్తి | ,, |
| డి. యస్. మురళీధర్ | ,, |
| డి. వి. యస్. సోమయాజులు | ,, |
| శ్రీమతి బి. సరోజినీరాజు | ,, |
| శ్రీ సి. అ . మోహనరావు | ,, |
| శ్రీ యం. అగస్త్యప్ప | ,, |
| శ్రీమతి టి. ఆదిలక్ష్మీదేవి | కర్నూలు |
| శ్రీ తుమ్మల జగదీశ్వరరావు | మచిలీపట్టణం |
| శ్రీ కోట సీతారామశాస్త్రి | ,, |
| శ్రీ కె. వి. కృష్ణమూర్తి | ,, |
| కుమారి వి. సుబ్బలక్ష్మి | ,, |
| సర్వశ్రీ ఏ, వి. కృష్ణమూర్తి | ,, |
| బిహెచ్. వి. యల్. రాధాకృష్ణమూర్తి | ,, |
| డా॥ సిహెచ్. దుర్గాప్రసాద్ | మద్రాసు |
| ఆదూరి హేరంబన్ | మచిలీపట్టణం |
| కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు | ఏలూరు |
| కె. యం. శర్మ | కాల్పక్కం |
| డా॥ సి. కోటేశ్వరరావు | విజయవాడ |
| వాసవ్య | నూజివీడు |
| టి. నరసింహమూర్తి | ,, |
| పులవర్తి ఓం నమశివయ్య | మచిలీపట్టణం |
| వి. వి. టోన్‌పే | ,, |
| కూరాళ్ళ రామచంద్రరావు | ,, |
| బి. సుగుణాకరరావు | ,, |
| సిహెచ్. దుర్గాప్రసాద్ | ,, |
| కాకుమాను వెంకటేశ్వరరావు | ,, |
| యస్. కోటేశ్వరరావు | ,, |
| శ్రీమతి కె. వసుంధరాదేవి | కొడాలి |
| ,, ముళ్ళపూడి జయభారతి | విజయవాడ |
| ,, శ్రీపతి లీలావతి | మచిలీపట్టణం |
| ,, యం. ఉష | గుంటూరు |
| సర్వశ్రీ పృథ్వి సుబ్బనాగయ్య | మచిలీపట్టణం |
| డి. సుబ్రహ్మణ్యం | భీమడోలు |

# సంపాదకీయం

సమాజంలో రచయితకున్న స్థానం చాలా కీలకమైంది. ఈ ప్రాధాన్యం సమాజం గుర్తించకపోయినా తానుగా రచయిత అడుగడు. అతని అవసరం ఎప్పుడూ ఈ లోకానికి కావలసిందే అని తెలిసి రచయిత తన కర్తవ్యాన్ని నిస్స్వార్థంగా సాగిస్తూనే వుంటాడు. కొన్ని కొన్ని రాజకీయాది ప్రభావాలవల్ల సమకాలిక సమాజం చిన్నచూపు చూస్తే ఆ దోషం రచయితది కాదు, మరి సమాజానిదే అవుతుంది.

రచయిత తనతోటి లోకంమీద ఏదో అవ్యాజమైన ప్రేమ, దయా దాక్షిణ్యాదులు చూపుతూ ఒక విశాలదృష్టితో పరికిస్తూంటాడు. నవ మానవ సంఘం సమున్నత శిఖరాల నందుకోవాలనుకొని ఏవో ఆదర్శాల వైపు పరుగిడుతాడు— దాని ఫలితం ఏమౌతుందో తను చూడలేకపోయినా సరే.

తనవాళ్ళ బాధామయజీవితం చూచి కుమిలి పోతాడు. వారి సుఖ సంతోషాలు పరికించి పరవశం చెందుతాడు. ఈ సహృదయతా లక్షణం సంపూర్ణంగా వున్నవాడు రచయిత. అయితే ఆ సుఖదుఃఖాల్లో పాలు పంచుకొని సానుభూతి ప్రకటించినంత మాత్రాన అతని కర్తవ్యం తీరలేదు. ఆ దుఃఖం పూర్తిగా పోవటానికి, ఆ సుఖం నిత్యంగా నిలవటానికి- తాపత్రయపడతాడు. అదీ పరమావధి కాదతనికి.

ఒక ఇంద్రియాతీతమైన తాత్త్వికదర్శనం రచయితకు వుంటుంది. ఆ తత్త్వదృష్టితో పరిశీలించి తన సమాజానికి నిత్యనూతనమూ, పరమసత్యమూ అయిన దివ్యసందేశం ఇస్తాడు. ఆ యా సందర్భాల్లో అది కర్తవ్యాన్ని ప్రబోధించి జనతను సమతా మార్గంలో నడుపుతుంది.

సమాజంమీద ఇతరశక్తుల ప్రభావం ఏమైనా పడితే అది తాత్కాలికం గానే వుంటుంది. అదే సారస్వత విప్లవం ద్వారా రచయిత తెచ్చిన చైతన్యమైతే అది సార్వకాలిక సందేశాన్నందిస్తూ శాశ్వత ప్రభావాన్ని చూపుతుంది.

అందుకనే రచయిత గుర్తింపబడని ప్రపంచ ప్రతినిధి. ఈ మాట ఏనాటిదో. అయినా యీనాటికది సవరణ కోరుతున్నది.

నేడు ఎప్పటికప్పుడు నూతనత్వాన్ని కోరుతూ మారిపోతున్న మానవ ప్రపంచంలో విజ్ఞానతృష్ణ, నిశితదృష్టి రేకెత్తినవి. మానవతలోని విలువ నిలతొక్కుకుంది. పరప్రత్యయనేయ బుద్ధితో అంధానుకరణం చేయటం అంత రించింది. మళ్ళా రచయితకు ప్రత్యేకస్థానం ఇవ్వబడింది. తరతరాలుగా మన సొత్తయిన తాత్త్వికచింతన తిరిగి తలెత్తింది. ఇప్పుడు రచయిత గుర్తింపబడిన ప్రపంచ ప్రతినిధి. •

ఈ ప్రపంచ ప్రతినిధులందరినీ ఒకచోట చూడటం కష్టం. ఆ మహనీయుల రచనలే వాళ్ళ వ్యక్తిత్వానికి రూపకల్పన చేస్తాయి వాళ్ళని మనసులో ఎంతగానో చిత్రించుకుంటాం. వాళ్ళను ప్రత్యక్షంగా చూస్తే యింకా ఎంతో ఆనందం కలుగుతుంది. యావద్భారత రచయితల్ని, పేరు ప్రసిద్ధులయిన తెలుగు రచయితల్ని అందర్నీ ఒక వేదిక మీద చూస్తే అది గొప్ప అదృష్టమే. కాని అటువంటి కార్యక్రమం ప్రభుత్వానికే సాధ్యం.

అందుచేత కనీసం కృష్ణాజిల్లాలో వుండే రచయితలందరూ ఒక సభలో కలిసి తమతమ సాధకబాధకాలను తెలుపుకోవటానికీ, ఆధునిక నవసమాజంలో చైతన్యం కలిగించి కర్తవ్యం ప్రబోధించటానికీ, వారి వారి కమనీయ కవితా సుధలతో సహృదయాలను పల్లవింపచేయటానికి ఈ కృష్ణాజిల్లా తెలుగు రచయితల నాల్గవ మహాసభ - ముఖ్యపట్టణ మయిన మచిలీపట్టణంలో జరుగుతున్నది.

హేమాహేమీ లయిన రచయితలెందరో యీ కృష్ణాతరంగిణీ పరీవాహ ప్రాంతాల జన్మించి ఒక్క తెలుగు మాగాణానికే గాక యావద్భారతానికి పేరు ప్రతిష్టలు తెచ్చి పెట్టటం మన అదృష్టం. వారందరికీ నమోవాకాలు. అచ్చమైన తెలుగుదనాన్నీ, సిసలైన తెలుగు పలుకుబడినీ, సమతా మమతా కలబోసిన జాతీయ భావాన్నీ తమ రచనల్లో నింపి పఠితల హృదయమందిరాల్లో దింపి; నవరసాల రసాల శాఖల గొంతెత్తి, కషాయ కంఠంలోంచి పీయూష మాధుర్యాన్ని కుమ్మరించిన కలకంఠా లెన్ని ఈ దేశపు ఘనతను కొనియాడాయో !

విశేషించి చెళ్ళపిళ్ళ గురుకులంలో తయారయిన దిగ్గజాల్లాంటి రచయితలకు పుట్టిల్లయిన మచిలీపట్టణంలో అన్ని రంగాల్లోనూ ఆరితేరిన ఉద్దండు లెందరో వున్నారు. చదువులతల్లి సకలకళాశోభితంగా విజయనగరంలో లాగా మన మచిలీపట్టణంలో విలసిల్లింది. నిత్యవసంతంతో కళకళలాడిన ఈ బృందావనంలో పసువం చెడని పారిజాతాలు పలు వన్నె చిన్నెలతో పరిమళాలు పంచిపెట్టాయి. వాటిల్లో ఒక ముద్దమందార మన విశ్వనాథ.

విశ్వనాథ కవితాసామ్రాజ్యాన్ని అచంచలంగా ఏలిన సామ్రాట్టు. సాహితీసాగరంలోంచి అనర్ఘ మణుల్ని పైకిదీసినట్టు. తెలుగు కవితోద్యానంలో సకల ప్రక్రియా కుసుమగుచ్ఛాల్ని స్వోపజ్ఞాదోహదంతో పూయించి నెత్తావులతో సాహితీజగత్తును గుబాళింపజేసిన యుగకర్త విశ్వనాథ. ఆయన భౌతికంగా దూరమైనా ఆయన కవితాపరిమళాలు అనంతవిశ్వాన్ని నిరంతరం సురభిళం చేస్తూనేవుంటాయి. ఆ కళాప్రపూర్ణుని దివ్యజ్యోతికి అంకితంగా ఈ సారస్వత సంచికను హృదయపూర్వకంగా సమర్పించుకొంటున్నాము. *

# స్పందన గమనం

సహృదయుడు తాను చదివిన అంశాన్ని, లేదా తెలుసుకున్న విషయాన్ని సంయమంతో, సమన్వయ దృక్పథంతో అవగాహన చేసుకొని, అవగాహన చేసుకున్న వస్తువును మానవతా మర్యాదల పరిరక్షణకు వినియోగించ గలిగినప్పుడు—అతని ఆత్మ వికాసానికీ, సమాజాభ్యుదయ సాధన కృషిలో అతన్ని భాగస్వామిని చేయడానికీ-ప్రేరణ నివ్వాలి సాహిత్యం. అప్పుడు మాత్రమే సాహిత్యానికి నిజమైన ప్రయోజనం సిద్ధిస్తుంది.

ఈ ప్రయోజన సాఫల్యానికి ఉడుతా భక్తిగా సేవ చేసే సాహిత్య సంస్థలు-సభలు, సదస్సులు, గోష్ఠులు, సమ్మేళనాలూ నిర్వహించటం పరిపాటి. ఈ కృషి సృజనాత్మకత, విజ్ఞాన తృష్ణల సమష్టి రూపానికి మాత్రమే దర్పణమౌతోంది. మరి ప్రచురణ విషయం ?

చదువరి, రచయిత, ప్రచురణకర్త - సాహితీ రంగంలో ఈ ముగ్గురికీ అవినాభావ సంబంధం వుంది. సాహిత్య సృష్టికి సాహిత్య పఠనం ఎంత అవసరమో సాహిత్య పఠనానికి సాహిత్య ప్రచురణ, సాహిత్య ప్రచురణకు సాహిత్యపఠనం కూడ అంతే అవసరం. సృష్టింపబడిన సాహిత్యం వెలుగుచూసి పదిమందిలో ఒకరినైనా ప్రభావితం చేయాలంటే ప్రచురణ తప్పనిసరి. ప్రోత్సాహిక రచయితలు, పుస్తక ప్రియులు, సాహితీవేత్తలతో కూడిన సాహిత్యసంస్థ-ఉత్తమ సాహిత్య సృష్టిని ప్రోత్సహించటం ఒక ఎత్తు; సాహిత్య ప్రచురణకు పూనుకోవటం వొక యెత్తు. సాహిత్యగోష్ఠులు. సభలు. సమాలోచనలు-నిర్వహించటం ద్వారా రచనను ప్రోత్సహించటం లోని వ్యయప్రయాసలకంటే.ప్రచురణ చేపట్టి జయప్రదం చేయటంలోని అనుభవాలు ఎంతో చేదైనవి. అందుకనే-"ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదులెమ్మ" అన్నాడు గాలిబ్. అయినా ప్రోత్సాహిక రచయితల రచనలు పాఠకలోకానికి పరిచయం కావటానికీ, ప్రసిద్ధ రచయితల రచనలు సమాజ వికాసాన్ని ప్రోదిచేయటానికీ-సాహిత్య సంస్థలు పుస్తక ప్రచురణకు పూనుకోవడం-కష్టసాధ్యమైనా — ఒక నైతిక బాధ్యతగా మారింది.

ఈ కారణాలవల్లనే పుస్తక ప్రచురణ మా సంస్థలో ఒక ముఖ్యమైన శాఖగా నెలకొనివుంది. అయితే ఎలాంటి పుస్తకాల ప్రచురణ ఆవశ్యకం—అంటే,

సమకాలీన సాహిత్య ప్రక్రియలైన నవల, కథ, కవిత, నాటిక విమర్శలలో సంకలనాలూ, సమీక్షా గ్రంథాలూ వెలువరించాలనీ,

ప్రోత్సాహిక రచయితలకు ఉపయుక్తంగా వుండే సాంకేతిక వివరాలను ప్రసిద్ధులైన రచయితలనుండి సేకరించి, క్రోడీకరించాలనీ,

తెలుగు నుడికారానికీ, తెలుగు పలుకుబడికీ పట్టం గట్టిన వైతాళికుల రచనల్లోని ఆణిముత్యాలకు సాహితీ వేత్తల సరళమైన వ్యాఖ్యలు అందించాలనీ,

"తెలుగును తెలుగువాడిలా తెలుగులా" వ్రాసే రచయితల రచనల్ని ప్రచురించి, ప్రతి తెలుగింటికీ పంచి, పాఠకుల్లో నవచైతన్యం వెల్లివిరిసేట్టు చేయాలనీ........మా ఆకాంక్ష, ఆశయం.

ఇందుకు చిత్తశుద్ధితో సాహిత్యోద్యమాన్ని నిర్వహించటానికి పూనుకున్నాము. అతి తక్కువ కాలంలో పదిహేను ప్రచురణలు వెలువరించగలిగేము. 'స్పందన', 'కవిత' వంటి సంకలనాలూ, డా॥ సి. నారాయణరెడ్డిగారి నృత్య గేయ రూపకం—'తరతరాల తెలుగు వెలుగు', శ్రీ రొంపిచర్ల కృష్ణశాస్త్రిగారి "ఆంధ్ర చంపూ రామాయణము", శ్రీమతి డి. కామేశ్వరిగారి కథలు 'వాన చినుకులు', డా॥ వి. వి. యల్. నరసింహారావుగారి సుమతి శతక వ్యాఖ్య— 'వినరా సుమతీ', శ్రీ శీలా వీర్రాజుగారి కథలు— "ఊరు వీడ్కోలు చెప్పింది"—వంటి పుస్తకాలు పాఠకుల ఆదరణనీ, ప్రముఖుల ప్రశంసల్నీ విశేషంగా పొంది, మా కృషిని రాణింపజేసి మా సంస్థ గౌరవ ప్రతిష్ఠల్ని ఇనుమడింపజేశాయి.

స్పందన నిర్వహించిన సాహిత్య కార్యక్రమాల్లో సర్వశ్రీ దివాకర్ల వేంకటావధాని, ఉషశ్రీ, మల్లాది శివరాం, డా॥ వి. వి. యల్. నరసింహారావు, మధురాంతకం రాజారాం, మంజుశ్రీ, వీరాజీ, కె. శివారెడ్డి, కూచిభట్ల చంద్రశేఖరశర్మ, అద్దేపల్లి లక్ష్మణస్వామి, మహతీ శంకర్, ఎమ్వీయల్, భాగవతుల కుటుంబరావు, నాదెళ్ల పురుషోత్తమకవి, డా॥ నాయని కృష్ణకుమారి, శ్రీమతి తేజోవతి, శ్రీమతి విజయలక్ష్మిరాజ్, శ్రీమతి పి. సత్యవతి, శ్రీమతి కె. వసుంధరాదేవి, డా॥ కె. వి. కృష్ణకుమారి, శ్రీమతి కావిలిపాటి విజయలక్ష్మి వంటి ప్రముఖ కవి పండిత విమర్శకులు, రచయితలు, రచయిత్రులు పాల్గొని ప్రసంగించారు.

ఈ సాహిత్యోద్యమ నిర్వహణలో చేయూతనిచ్చి మా కృషికి సహకారాన్నందించే సహృదయులను ఆహ్వానిస్తూ 'స్పందన బంధు' 'స్పందన మిత్ర' పథకాలు ప్రకటించాము. వెంటనే ఎంతోమంది సాహితీ మిత్రులు ఉత్సాహంగా ఈ పథకాల్లో చేరారు.

ఈ మహాప్రస్థానంలో వొక ముందడుగుగా కృష్ణాజిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభల్ని నిర్వహిస్తున్నాము. సాంస్కృతికంగా ప్రాధాన్యత వహించి, సాహితీచైతన్యం వెల్లివిరుస్తున్న మచిలీ పట్టణంలో ఈ సభలు జరగటం—జిల్లా రచయితల కందరికీ హర్షాన్ని కలిగించింది,

ఇలాంటి సాహసకార్యక్రమాలను నిర్వహించడం లోనూ, అసిధారావ్రతంగా మారుతున్న పుస్తక ప్రచురణను విజయవంతం చేయడంలోనూ మాకు తమ అండదండల్ని అందిస్తున్నవారిలో ఎందరో ప్రసిద్ధులైన సాహితీవేత్తలు, సాహితీప్రియులు వున్నారు. వారందరికీ మా కేల్మోడ్పులు ! మా సంస్థ గౌరవ సలహామండలి ప్రోత్సాహం మాకెప్పుడూ కరదీపికగా నిలుస్తోంది. వీరికి మా అభివాదాలు !

అలాగే స్పందన బంధువులు, స్పందన మిత్రులు, ప్రకటనకర్తలు, ఉదారమహాశయులు — ఆర్థికంగా మాకు చేయూతనిస్తున్న సారస్వత పోషకులు. వీరికి మా సమాఖ్య ఎప్పుడూ ఋణపడే వుంటుంది. పుస్తకాల విక్రయంలో, ప్రచురణ పూర్వ విరాళాల సేకరణలో ఎందరో మిత్రులకూ, ఆత్మీయులకూ శ్రమ కలిగించటం తప్పనిసరి అవుతోంది. వారికి మా కృతజ్ఞతలు !

కృష్ణాజిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభల సందర్భంలో మాతో సహకరించిన వివిధ సంఘాల సభ్యులకు, శుభాకాంక్షా సందేశాల నందించిన పెద్దలకు, ప్రత్యేక సంచికలోని రచయితలకు, ప్రకటనకర్తలకు, ప్రధాన పోషకులకు, ఇతర పోషకులకు, విరాళాల నందించిన ఉదారులకు, ప్రకటనల సేకరణలో తోడ్పడిన మిత్రులకూ, తుఫాను తాకిడి కల్పించిన తీవ్రమైన అసౌకర్యాల్లో సైతం మా పనులపట్ల ప్రత్యేక శ్రద్ధతో సహకరించిన శ్రీ భారతీ ప్రెస్, శ్రీ నందినీ ప్రెస్, నేషనల్ ప్రెస్, త్రివేణీ ప్రెస్ యాజమాన్యంవారికీ, సిబ్బందికీ; మా పరిస్థితిని సానుభూతితో అర్థం చేసుకుని మాకు సహకరించడంలో తాము అనేక యిబ్బందులకు గురి అయిన ప్రతిఒక్క సహృదయ మిత్రునికీ మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు !

స్పందన సాగిస్తున్న అనంత చైతన్య యాత్రలో ప్రతి ఒక్కరి సహకారమూ మాకు ఒక్కొక్క సహకారం !

**స్పందన సాహితీ సమాఖ్య రిజిస్టర్డ్.**

జడప్రాయంగా వున్న
అమిత జ్ఞానం కన్న
చైతన్య రూపంలో వున్న
పరిమిత జ్ఞానం మిన్న
అన్న కవితోక్తి
స్పందన సాహితీ సమాఖ్య
పురోగమన శక్తి

నవతా ఆర్ట్స్

# అమెరికా అమ్మాయి

ఈస్ట్‌మన్ కలర్




నిర్మాత: ఎన్.కృష్ణంరాజు దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు అన్నపూర్ణ విడుదల

# సారస్వత ప్రియులకు పుస్తక నీరాజనం

## కవిత

మహాప్రస్థానం — శ్రీ శ్రీ —3.00
అమృతం కురిసిన రాత్రి—తిలక్ —4.50
మల్లారెడ్డి గేయాలు—గజ్జల మల్లారెడ్డి —1.50
ముత్యాలసరాలు—గురజాడ అప్పారావు—4.00
తెలంగాణా జానపద గేయాలు—
లక్ష్మీకాంత మోహన్ —4.00

## కథలు

సింహాద్రి స్వీట్ హోం—సోమంజయరాం 3.00
తిలక్ కథలు — తిలక్ —5.50
లైఫ్ ఇన్ ఎ కాలేజ్ — నవీన్ —3.00
స్వాపిక — వాకాటి పాండురంగారావు —2.50
ముసురు — పెద్దిభొట్ల సుబ్బరామయ్య—3.50
పిల్ల — ,, ,, 3.50

## నవలలు

సుళి—విడమర్తి సత్యనారాయణమూర్తి 9.00
మోదుగుపూలు—దాశరథి రంగాచార్య 9.00
ప్రజలమనిషి—వట్టికోట ఆళ్వారుస్వామి 4.00
గంగు — ,, —10.00
విరామం — అంగర కృష్ణారావు —3.00
చంఘిజ్ ఖాన్—తెన్నేటి సూరి —14.00
అతడు—ఆమె ఉప్పల లక్ష్మణరావు —7.50

## సాహిత్య గ్రంథాలు

మహోదయం —కె.వి. రమణారెడ్డి— 12.00
నుడి-నానుడి—తిరుమల రామచంద్ర —3.00
ఆంధ్ర వాగ్గేయకారచరిత్రము —
బాలాంత్రపు రజనీకాంతరావు—25.00
సాహిత్యావలోకనం —
సోదుం రామ్మోహన్ 6.00

## నాటకాలు నాటికలు

ఎర్రిమట్టి—ఎం.జి.రామారావు —2.00
మాభూమి—సుంకర, వాసిరెడ్డి —2.00
అశోకం —ముద్దుకృష్ణ —1.50
సుచిత్రప్రణయం—తిలక్ —1.50
సుప్తశిల—తిలక్ —1.50

## తాతాజీ రచనలు

పాతపాళి —4.00
కొత్తపాళి —5.00
సాహిత్య మోర్చాలు —4.50
ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ
మహాసభ 4.00
పెళ్లి—దాని పుట్టుపూర్వోత్తరాలు —5.00
దేవాలయాలమీద బూతు
బొమ్మలెందుకు?—4.00

## విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

చంద్రం బిల్డింగ్స్ : : విజయవాడ-520004

బ్రాంచీలు : విశాలాంధ్ర బుక్ హౌస్, విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం, అనంతపురం. తిరుపతి

# మా ప్రచురణలు

| | | |
|---|---|---|
| రాగధార | విమలా రామం | 10-00 |
| వసుంధర | ,, | 7-50 |
| తమసోమా | పి. రాజగోపాలనాయుడు | 7-50 |
| రాజకీయం | ,, | 6-00 |
| నత్తగుల్లలు | తులసీకృష్ణ | 7-50 |
| ఇదిమాతరంకథ | బి. కృష్ణవేణి | 6-00 |
| శమంత - హేమంత | పి. వి. ఆర్. శివకుమార్ | 5-00 |
| క్షమార్పణ | గంటి వెంకటరమణ | 6-00 |
| ఏటిబిడ్డ | ,, | 6-00 |
| మీరు-మీ ఆరోగ్యం | డా॥ యలమంచిలి శివాజీ, M. B , B. S. | 10-00 |
| గంగ | యార్లగడ్డ సరోజినీదేవి | 6-00 |
| ప్రతిఫలం | ,, | 8-00 |
| భవబంధాలు | ,, | 6-00 |
| రాగవీచికలు | ఏ. వి. సీతారామమూర్తి | 6-00 |
| భవతీ భిక్షాందేహి | ఇల్లిందల సరస్వతీదేవి | 7-50 |
| నీ బాంచను కాల్మొక్తా | ,, | 11-00 |

57

# కందుకూరు రచయితల సహకార ప్రచురణ మరియు ముద్రణ సంఘము లిమిటెడ్ No. O. R. 54

ప్రకాశంజిల్లా కందుకూరు డివిజన్‌లోని రచయితలు 1973 సంవత్సరములో ఈ సంఘమును స్థాపించి రిజిష్టరు చేయించినారు. ఈ సంఘంలో ప్రకాశం జిల్లాలోని ప్రముఖ రచయితలు, రచయిత్రులు సభ్యులుగా వున్నారు. ప్రభుత్వమువారు ప్రింటింగు ప్రెస్సు కొనుటకై రు. 30,000/- లు మంజూరు చేసినారు. ఈ సంఘము ప్రింటింగు ప్రెస్సు కొని, కందుకూరులో స్థాపించి సుమారు నాలుగు నెలలనుంచి పని జరుపుచున్నది.

## సంఘ కార్యవర్గము

| | | |
|---|---|---|
| 1. | శ్రీ పవని శ్రీధరరావు | అధ్యక్షులు |
| 2. | శ్రీ కరణం సుబ్బారావు | ఉపాధ్యక్షులు |
| 3. | శ్రీ విక్రాల శేషాచార్యులు | కార్యవర్గ సభ్యులు |
| 4. | శ్రీమతి పొన్నలూరు పద్మావతి | ,, |
| 5. | శ్రీమతి ఆవుల ప్రమీలాదేవి | ,, |
| 6. | శ్రీ ఏ. ఎల్. నారాయణరావు | ,, |
| 7. | శ్రీ కలువ శ్రీనివాసరావు | ,, |

ఘాలి రంగారావు
మేనేజరు

# కృష్ణాజిల్లా సాహిత్య చరిత్ర - సంక్షిప్త సమీక్ష

## శ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ

సాహితీ విహాయసంలో సుమారంగా మిళుకు మిళుకుమంటున్న చుక్కలు కొన్ని, వెలుగు ముద్దలుగా ప్రకాశిస్తున్న రిక్కలు కొన్ని. వాటిల్లో దేనికదే ఓ ప్రత్యేకత కలవి. ఈ అనంతాకాశాన్ని ఇవన్నీ తమ అపూర్వ కాంతిరేఖలతో అలంకరిస్తూ ప్రపంచానికే ఒక గొప్ప శోభను కూరుస్తున్నాయి. అతివేగంగా కాలం కదుల్తున్నా ఇవి మాత్రం నిశ్చలంగా నిల్చి కాలగతిలో వస్తూన్న మార్పుల్ని గమనిస్తూ ముందు ముందు తరాలవారికి వెనకవెనక చరిత్ర సత్యాల్ని ప్రతిఫలించి చూపిస్తూ అప్పటికీ ఇప్పటికీ ధ్రువతారలుగా నిల్చాయి. అవి చుక్కలు కాదు. అమృతపు చుక్కలు. కళామయ జీవితానికి తమను తాము అంకితం చేసుకొని విశ్వశ్రేయస్సుకు సెంపర్లాడుతున్న వాఙ్మయ స్రష్టలు - రచయితలు. అంటే కవులూ పండితులూ అంతా అన్నమాట. ఇది ప్రపంచ మంతటికి సంబంధించిన ఒక నిజం.

దీన్నే ఒక పరిమిత విషయంగా తీసుకొని పరిశీలన ప్రారంభిస్తే వివరంగా విషయాలు తెలుస్తాయి.

కృష్ణామండలంలో పుట్టిపెరిగిన, దీర్ఘకాలం మనుగడ సాగించిన చిన్నా పెద్దా రచయితలు ఎంతమందో తెలుగు సరస్వతిని ఆరాధించి, అమృతం కురిపించి, సాహితీ క్షేత్రాన్ని సస్యశ్యామలం చేశారు. కృష్ణా సైకతాల్లో పిచ్చుకగూళ్ళు కట్టుకొని, కృష్ణా సలిల సుధాపానం కడుపార చేసిన కవి మేఘాలు కృష్ణా మండలమే కాదు, భూమండలమంతా పీయూష వర్షం కురిపించాయి; రతనాలను దొర్లించాయి; ముత్యాల ముగ్గులు పెట్టాయి; పగడాల కాంతులు పరచాయి. ముఖ్యంగా తెలుగు సారస్వత ప్రాంగణంలో బంగారు కాంతులతో విభిన్న ప్రక్రియా కుసుమాలతో సువాసనలు విరజిమ్మాయి.

తెలుగులో గతాగత సాహిత్యాలకు వారధిగా నిల్చి పాతకొత్తల సంధిలో భరత వాక్యనాందీలను పలికిన శ్రీ చెళ్ళపిళ్ళను తలచకుండా ఏ తెలుగు రచయితా కలం కదపడు. బందరు వీధుల్లో విశ్వనాథ పింగళి కాటూరి లాంటి పలువురు శిష్యులు వెంటరాగా తెలుగు సరస్వతి ఒయ్యారంగా కదిలి వెళుతోందా అన్నట్లు చెళ్ళపిళ్ళస్వామి "పదమెత్తంగలహంసలీల' గా నడయాడి బందర్ని ఒక సారస్వత వేదిక చేశారు. ఆ శిష్యపరంపరలో పాండిత్య ప్రతిభలు పెనవేసుకొని నీవా నేనా అని ఢీకొనగలిగిన చిరివాడ నివాసి శ్రీ వేలూరి, తన హేతువాద వైశారద్యంతో నవసమాజ నిర్మాణం చేద్దామని రచన సాగించిన శ్రీ త్రిపురనేని అసాధారణ ప్రజ్ఞాధురీణులు. ఈ శిష్యులంతా చెళ్ళపిళ్ళ కవితా వృక్షానికి కాచిన మధుర ఫలాలు. ఒకరి రచన వంటిది మరొకరిది కాదు. దేనికదే కమనీయ రుచులతో నిండింది.

మారుమూలనున్న గ్రంథాల్ని పైకితీసి, పరిశోధనాదృష్టితో పరిశీలించి భాషాసేవ చేసిన మహాపండితుడు శ్రీ వేటూరి, మాని

కొండ రామాయణం అనే ప్రసిద్ధి సంపాదించిన రామాయణం రచించిన శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి - కృష్ణా మండలానికి అలంకారాలు.

ముఖ్యపట్టణమైన బందరులో ప్రసిద్ధ పండితులు, కవులు-రచయితలు, అనేకులు పుట్టినవారు, ఉద్యోగరీత్యా బహుకాలం వున్నవాళ్ళు, చదువుసంధ్యలిక్కడే నేర్చిన వాళ్ళున్నారు. వారిలో శ్రీ కొడాలి సుబ్బారావు, కొడాలి అంజనేయులు, నాయని సుబ్బారావు, జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి శ్రీరాం వీరబ్రహ్మకవి మామిడి వేంకటార్యులు, హరి నాగభూషణం, నాదెళ్ళ పురుషోత్తమకవి, నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి, కంభంపాటి రామమూర్తిశాస్త్రి వంటి ఉద్దండులు సుప్రసిద్ధులు. ప్రస్తుతము "కరుణశ్రీ" వంటి మధురకవులను తయారు చేసిన శ్రీ కుప్పా శ్రీఆంజనేయశాస్త్రి 'కవిపాదుషా' పువ్వాడ, 'కవిశేఖర' గురుజాడ "అభినవరామకృష్ణ" అడ్డేపల్లి లక్షణస్వామి "అభినవజాషువా" శ్రీ చిట్టా రామకృష్ణ రావు, "అలంకారిక శిరోమణి" శ్రీ భాగవతుల కుటుంబరావు, ఆంధ్ర వ్యాకరణం ఆపోశనం పట్టిన శ్రీ జొన్నలగడ్డ నారాయణ శాస్త్రి మొదలయిన పండిత కవులు శారదాదేవి అనుగ్రహ పాత్రులు. శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారంటే- తెలుగు భాష తియ్యందనాలు తన సహజసుందర సరళ జాను కవితలో అచ్చుపోసి తెలుగు హృదయాలకూ, సినీ ప్రేక్షకలోకానికీ విందు చేసిన సినీ కవి కుల గురువు.

ఇంతేగాక సినీరచయితగా ప్రసిద్ధికెక్కి- 'వింధ్యరాణి', 'నారాజు' లాంటి స్వతంత్ర చారిత్రక నాటకాలు రచించిన శ్రీ పింగళి నాగేంద్రరావు. సూటిగా చూచి ఘాటుగా విమర్శించి హాస్యం చిందే ప్రసంగాలు పటిక బెల్లంలా పంచిపెట్టే శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి—ఆకాశవాణి శ్రోతల హృదయాల్లో చిక్కని అభిమానం సంపాదించుకొన్న మంచి రచయిత. వీళ్ళిద్దరూ బందరు వాళ్ళే. ఇలాగే విజయవాడలో సాహిత్య సృష్టిచేసిన మహా రచయితలున్నారు. శ్రీ దోమా వేంకటస్వామిగుప్త, శ్రీమతి కాంచనపల్లి కనకాంబ, శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి, పిళ్ళా వెంకరత్నకవి, శ్రీ వేదాంతకవి వంటి వారేగాక నేటికీ శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి వంటి కవులున్నారు.

శ్రీ విన్నకోట మాధవరావు, ఎర్రోజు మాధవాచార్యులు, కాకాని నరసింహారావు, డా. త్రిపురనేని వెంకటేశ్వరరావు మొదలగు ఉత్తమ రచయితలు గుడివాడ పట్టణంలో నేటికీ సారస్వతసేవా దురంధరులు.

ఇవన్నీ ఒకఎత్తు. మొవ్వ, కూచిపూడి గ్రామాలు కృష్ణామండలానికిచ్చిన సారస్వతం ఒకఎత్తు. తెలుగు వెలుగులు ఈ నేలపై ప్రసరించేతవరకు ఈ గ్రామాల కీర్తిపతాక రెపరెప లాడుతూనే వుంటుంది. క్షేత్రయ్య, సిద్ధేంద్రయోగులు తమ పదకవితా కౌముదీ కాంతుల్ని కృష్ణామండలాన్నేగాక యావద్భారతాన్ని వ్యాపింపజేసి సహృదయ హృదయ కుముదాల్ని వికసింపజేశారు.

ఇలాగే కృష్ణామండలంలోని ప్రాచీన సారస్వతచరిత్ర తిరగేస్తే మనకెంతో ఆశ్చర్యం, దానితోపాటు గర్వం కలగక మానదు. ఎందుకంటే-శ్రీ అడుసుమిల్లి పూర్ణచంద్రరావు గారు సేకరించిన సమాచారం చూస్తే నిజంగా మన మండలం సాహితీభూమండలమే అనిపిస్తుంది. అసలు ప్రబంధయుగానికి సగం బలం

ఇక్కడివారిచ్చిందే అనాల్సివస్తుంది. పింగళి యింటిపేరుగలవాళ్ళే కండలంలో వాళ్ళే. దేవ మనుష్యసంబంధమైన మిశ్రమకల్పనాకథను కన్నుకు కట్టినట్టు చిత్రించి కళాపూర్ణోదయం తెలుగుల పంటగా అందించిన పింగళి సూరన, మనుచరిత్రకు దీటుగా సంగీత సాహిత్యాల్ని కలబోసి శ్లేషకావ్యంగా వసుచరిత్రను తీర్చి దిద్దిన భట్టుమూర్తి, అలాగే అష్టదిగ్గజాల్లో పైవాళ్ళ సరసన కూర్చొన్న రాజశేఖర చరిత్రకర్త మాదయ్యగారి మల్లన, దగ్గుపల్లి దుగ్గయ మొదలయినవాళ్ళు మనవాళ్ళే అనంగానే ఏమనిపిస్తుందీ? —ఒళ్ళు పులకరిస్తుంది.

మనం విశ్వనాథ సమకాలికులం అని ఆయన సర్వతోముఖ ప్రతిభకు నివాళిపట్టిన మనం-ఒక్కొక్క విషయంలో శ్రీనాథకవిని తప్పక తల్చుకుంటాం. ఆ శ్రీనాథుడే విశ్వనాథలాగా కృష్ణామండలం కనిన వజ్ర మణి అని తెలుసుకొంటే ఏమౌతాం? ఒక్క సారి ఆనందలోకాల్లో విహరిస్తాం. "దీనార టంకాల తీర్థమాడించితి", "దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ" మొదలయిన పద్యాల్ని అప్రయత్నంగా ఆలపిస్తాం. ఎంత అదృష్టం! ఆంధ్రనైషధ కర్త, అయఃపిండం భేధించిన దిట్ట-కవిసార్వభౌముడు మనవాడే అని మురిసిపోతాం.

ఇది సరే, సంస్కృత కవితావాహిని సంగీత తరంగిణీసంగమం చెంది-కృష్ణలీలా తరంగిణి అయింది. మధురమైన భక్తితో మనసు ఉప్పొంగేలా రచన చేసిన భక్తకవి వతంసుడు శ్రీ లీలాశుకుడు కృష్ణాతీర నివాసి.

కృష్ణాతీరంలో శ్రీకాకుళంలో వేంచేసి వున్న చల్లపల్లి సంస్థానంవారి ఆంధ్ర విష్ణు దేవాలయాన్ని చూచి కాసుల పురుషోత్తమ కవి ఒక శతకం వ్రాశాడు. అందులో అన్నీ సీసపద్యాలే. బహుశ అతను చల్లపల్లి ఆస్థాన కవేమో తెలీదు. "చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్యభావ-హత విగతజీవ శ్రీకాకుళాంధ్ర దేవ" అనే మకుటంలో వ్యాజస్తుతి చేశాడు!

కామశాస్త్ర గ్రంథమొకటి కొక్కోకం అనే పేరుతో ప్రసిద్ధి కెక్కింది. దాన్ని వ్రాసినవాడు కూచిరాజు ఎఱ్ఱన. ఇతనికే మరో పేరు కొక్కోకుడు. ఇంత ప్రసిద్ధుడైన ఇతను తీరా పరిశీలిస్తే కృష్ణామండలం వాడేనట.

అలాగే మన దేశంలో ఎలిమెంటరీ స్కూల్లో చదివే విద్యార్థిదగ్గర్నుంచి కాలేజీ విద్యార్థి వరకు పఠ్యగ్రంథాల్లో భర్తృహరి సుభాషితాలు తెలుగులో చదవనివారుండరు. సంస్కృతంలో భర్తృహరివ్రాస్తే తెలుగులో ముగ్గురు కవులు అనువాదం చేశారు. అందులో ఎలకూచి బాలసరస్వతి ఒకడు. ఇతని ప్రతిష్ఠ యింతేగాదు 'బాలసరస్వతీయం' అనే ఒక తెలుగు లక్షణ గ్రంథం కూడా వ్రాసి ప్రసిద్ధికెక్కాడు. ఇతనూ కృష్ణా మండలం వాడే!

ఛందో గ్రంథం వ్రాసిన అనంతా మాత్యుడు కూడా ఇక్కడివాడే అంటే మరీ ఆనందం కల్గింది. ఇతను "భోజరాజీయం" అనే కావ్యం కూడా చాలా చక్కగా వ్రాశాడు.

ఇలా గత చరిత్రంతా తవ్వుకుంటూపోతే కృష్ణామండలం ఒక వజ్రాల గని అనిపిస్తుంది కదూ! మరో విశేషం ఏమంటే కృష్ణా మండలానికి సంబంధించినంతవరకూ ప్రాచీన సాహిత్యంలోని చరిత్ర యెంత మహో దాత్తంగా వుందో దానికి సమాత్రం తీసి పోకుండా అర్వాచీన రచయితలు-అంటే సమ కాలీన సాహిత్య ప్రక్రియలు కథా కథానికా గేయ వచన కవితల్లో చేయి తిరిగిన సిద్ధహస్తులు అంతమందీ వున్నారు. అది వేరే వ్రాయవలసిన అధ్యాయం! *

# జీవదీపం

శ్రీ జి. వి. పూర్ణచంద్

బోరగిలిన బూరె లమూకుడు మీద
భానుడు — స్వ
భావం మరచి, పసికూనలా
పారాడుతున్నప్పుడు — నల్ల
బజారులో కొన్న తెల్ల చక్కెరలా
నీరుగారి పోతున్నప్పుడు — నువ్వు
అభావంలో అస్తిత్వం
అన్వేషిస్తూ — ఆరిపోయిన
దీపపు వెలుగు వెనుక — అద్దంలో
అందాలన్నీ ఒలక బోస్తున్నప్పుడు — నీ
వాకిటి నిండా కాఱుచీకటి !

నీలాంటి రేవులో, నీలాంటి ఒకరు
పాకుడు మెట్లమీద —
పాకుతున్న నీటి పురుగులా
కదిలే కాలానికి కాళ్ళు లేవంటూ
కాకమ్మ కావ్యాలు బనుకుతున్నప్పుడు — ఈ
మనుషుల మనసులనిండా చీకటి !

మాంసంలేని యెముక కోసం
పదికుక్కలు కొరట్లాడే — నడి
బజారులో నడిచి వెళ్తున్నప్పుడు — మనం
సామాన్యుణ్ణి స్పృశించిన సిటీబస్‌లా
ముందుకు చొచ్చుకుపోతున్నప్పుడు,
రోడ్డుప్రక్కని ఎంగిలి
తెచ్చిపెట్టిన తగువుని
చూసి వినోదిస్తున్నప్పుడు —
మన కళ్ళనిండా కటిక చీకటి !

ఈ చీకట్లు కూకటివ్రేళ్ళు
పెళ్ళగించేందుకు
చిరుదీపం వెలిగిద్దాం రండి—జగతికి
జీవదీపం అందిద్దాం రండి !

# బాల సాహిత్యం

"బాలబంధు"

## శ్రీ బి. వి. నరసింహారావు

శ్రీ గుడిపాటి వెంకట చలం ఒక సందర్భంలో విశ్వకవి టాగూరు గీతం ఒరవడిలో

ఎక్కడ బడి అనేది లేదో
ఎక్కడ పిల్లలకి ఆడుకోవడమే విద్యో
ఎక్కడ బలవంతమనేది పిల్ల లెరుగరో
ఎక్కడ పిల్లలు పెద్దలకి అర్థమౌతారో
ఎక్కడ పెద్దలు పిల్లలైపోతారో
తండ్రీ! ఆ లోకంలో నన్ను సృష్టించు–

అని రాసుకున్నారు.

మూడు దశాబ్దుల నా విద్యాశాఖానుభవం, మూడు దశాబ్దుల నా బాలరచనానుభవం దీన్ని అక్షర సత్యంగా గ్రహించింది.

'మనం మన పెంపకంవల్ల, విద్యా బోధనవల్ల, బాల సాహిత్యసృష్టివల్ల భావితరానికి చెందిన పిల్లలను దగాపడిన తమ్ముళ్ళనుగా, దారితప్పిన తమ్ముళ్ళనుగా తయారు చేయకుందుము గాక' అని దీక్షబూనాలి.

ప్రాచీన జానపద వాఙ్మయంలో స్త్రీల పాటలు ఒక భాగం. ఆ పాటలలో చేరియున్నదే బాలసాహిత్యం. అక్కడ ఈ బాలసాహిత్యం తల్లి ఒడిలోని పిల్లలాగ తన స్నిగ్ధ నగ్న రూపంతో దర్శన మిస్తుంది. అది గేయ రూపాత్మకం. అసలు ఏ భాషలోనైనా తొలి కవితారూపం గేయంగానే వెలువడింది. క్రమంగా గద్య పద్య రూపం ధరించింది.

ఈ సాహిత్యం అలేఖ్యం (un-written). దీని కర్తృత్వం తెలియదు. ఈ పదాలు నన్నెచోడుడికీ, నన్నయ్యకూ పూర్వమే బహుళ ప్రచారంలో నున్నట్లు శాసనదాఖలా. భాష ప్రజాభాష. అందుకే ఆ కవితలు అంత సరళంగా, సహజ సుందరంగా ఉన్నవి. జాతి శైశవ దశను అవి దర్పణం పట్టి చూపుతున్నవి. అంతే కాదు. నేటి మన ప్రౌఢ రచనల్లో అనలుగా గోనలుగా అల్లుకొని కానవచ్చే కవితా లక్షణాలన్నీ, నాటి బాల రచనల్లో అంకురప్రాయంగా కనబడతాయి.

పూర్వ కవులు కొందరు ఆనాటి పాటలకు ఆటలకు గల అవినాభావ సంబంధాన్ని తమ కావ్యాల్లో అక్కడక్కడ ఉదహరించారు.

ఆటగా తమ జీవితాన్ని ఆనందమయము నొనర్చుకొన్న నాటి ప్రజలు పాటలను ఎంతగా ఆదరించి పోషించుకొన్నారో చెప్పలేము. ఈ పాటలు ఇన్ని రకాలని చెప్పలేము. ఊహా పోహాల్లో, ఉత్సాహ తాళగతుల్లో అవి అనంతం, అద్భుతం.

బాలురకు వేరు, బాలికలకు వేరు పాటలుండేవి. వారి వయః ప్రభేదాన్ని బట్టి అవి ఉండేవి. పండుగలకు, పబ్బాలకు, వేడుకలకు వినోదాలకు సంబంధించి రకరకాలుగా ఉండేవి.

లోకుల వాక్కులందే ఇవి పుట్టి పెరిగి ఈనాటికీ చెక్కు చెదరకుండా నిలిచియున్నవి. ఈ విస్తృత వాఙ్మయాన్ని ఎందరెందరో త్రవ్వి వెలికి తీశారు. దీనికి సాహిత్యగౌరవం సమకూర్చిపెట్టారు.

మొదట తల్లులలో, దాదులలో, తల్లిహృదయమున్న కర్షకులలో, కవులలో ఈ పాటలు ఆనం

దావేశంలో అప్రయత్నంగా ఋక్కులు గానం చేసిన ఋషులవలె గానంచేసిఉంటారు.

ఈ గేయాల్లో శబ్దార్థ సంఘటనం చాల సహజం. అలంకారాల ఆడంబరం, కూర్పులో కృతకం తక్కువ. అన్ని తరహాలవారినీ, దశలవారినీ అలరించే ప్రసాదగుణం ఇందులో పుష్కలంగా ఉంది.

జాతి జీవిత ప్రతిబింబితం, జీవ చైతన్య విలసితం అయిన ఈ పాటల్లో పసివారి హృదయ తంత్రుల్ని పట్టి మీటగల పదగతి ఉంది. శబ్దాన్ని అర్థాన్ని మించిన ఆ లయ తాళగతికి పిల్లలు మురిసి ముగ్ధులౌతారు.

ఎంతో లాలిత్యం, హృదయ నైర్మల్యం, భావ పరిమళం జాల్వారుస్తూ సూటిగా సుందరంగా పలికిన ఈ పాటలకన్న వేరే కవిత్వం ఎక్కడుంది?

ఈ పాటలు కొన్ని యావదాంధ్రకు చెందినవి, కొన్ని చాళుక్యసీమ (సర్కారు జిల్లాల)కు చెందినవి; కొన్ని కాకతిసీమ (తెలంగాణా)కు చెందినవి, కొన్ని రాయల సీమకు చెందినవి ఉన్నవి. ఆ యా మండలాలకు చెందిన నుడికారం (యాసలు) వానిలో ఉన్నా, అంతస్సామ్యం అన్నింటా అమరి ఉంది.

మార్గకవిత్వమనే పురాణాలు ప్రబంధాలు పండితులకూ ప్రభువులకూ మాత్రమే పరిమితమై యుండేవి. సామాన్య జనుల కవి అందుబాటులో ఉండేవి కావు. ఆ సాహిత్య వీధిలో సామాన్య మానవుని స్పర్శే లేదు.

అందుకే సుందర ప్రకృతి నందనులైన జానపదు లెందరో వచ్చి ఆత్మానందానికి ఈ ముగ్ధమోహన దేశి ఛందస్సు పాటలు అల్లడం ప్రారంభించారు. ఈ దేశి కవితలకు శివకవుల రాకతో మంచి ప్రాచుర్యం లభించింది.

నేడు బాల సాహిత్యం ఎన్నో రకాల ప్రచారాన్ని పొందుతున్నది. ఎందరో రచయితలు బాలసాహిత్యకృషిని బహుళంగా సాగిస్తున్నారు. పిల్లలకోసం పాటలు, కథలు, నాటికలు సుగమ విజ్ఞాన శాస్త్రగ్రంథాలు రచిస్తున్నారు. సినిమారంగాన, ఆకాశవాణి ప్రసారాల్లో, దిన వార మాస పత్రికల్లో బాల సాహిత్యానికి తగినంత స్థానం లభిస్తున్నది. పాఠ్యగ్రంథాల్లోకూడ బాల సాహిత్యం చోటు చేసుకొన్నది. రాష్ట్ర ప్రభుత్వాలు, అనేక పుస్తక ప్రచురణసంస్థలు పోటీలు నడిపి ఉత్తమ సాహిత్యానికి ఉచిత కీర్తిని పారితోషికాలు అందజేస్తున్నాయి.

1976 మార్చిలో మన ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం బాలల అకాడమిని స్థాపించింది. దానికి 14-9-76న మన రాజధాని హైదరాబాదులో భారత రాష్ట్రపతి శ్రీ ఫకురుద్దీన్ అలీ అహమ్మద్ ప్రారంభోత్సవం చేశారు. ఆ బాలల అకాడమిలో ఈ వ్యాసకర్త ఒక కార్యవర్గసభ్యుడుగా ఎన్నుకోబడినాడు.

ఈ సందర్భంలో మన బాలల అకాడమి ముఖ్యాశయాలను కొన్నింటిని ఇక్కడ పేర్కొనడం చాల అవసరం. అవి:—

1. పిల్లలలో శాస్త్రీయదృక్పథం, పరిజ్ఞానం కలిగించుటకై మంచి కథలతో కవితలతో, ఆధునికవిజ్ఞాన విషయాలతో కూడిన సారస్వతాన్ని ప్రచురించడం.

2. బాల సాహిత్య కర్తల కృషిని సమన్వయ పర్చడం.

3. పిల్లలలోని రచనాశక్తిని, సాహిత్య కళాభిరుచిని పెంపొందించడానికి ప్రత్యేకంగా ఒక బాలల పత్రికను నడపడం.

4. పిల్లలకు అర్థమయ్యే సరళభాషలో

శాస్త్రీయ విషయాలతో సచిత్ర విజ్ఞాన సర్వస్వం ఒకటి ప్రచురించడం.

ప్రభుత్వమే చేపట్టింది కనుక ఈ ఆశయాలన్నీ ఫలోన్ముఖం చెందడానికి ఎట్టి ఆటంకముండదు. అలా జరిగిననాడు బాలల అకాడమి స్థాపన సార్థకత చెందినట్లు భావింపవచ్చు.

బాల సాహిత్యసృష్టి ఒక గొప్ప కళ. దానికి ఎంతో ఆలోచన, పరిశీలన అవసరం. పిల్లల మనస్తత్వాన్ని ప్రత్యేకంగా ఆకళింపు చేసికోవాలి. వాళ్ళ ప్రత్యేకతను గుర్తించి, దానిని తగినట్లు ప్రోదిచేసి, పిల్లలను వాళ్ళ మార్గాన సర్వతోముఖాభివృద్ధి చెందేటట్లు చూడాలి.

నాటి మన ప్రాచీన బాల వాఙ్మయాన్ని గానీ, నేటి ప్రపంచ బాల వాఙ్మయాన్నిగానీ పరీక్షగా చూచినట్లయితే ప్రౌఢవాఙ్మయానికి భిన్నమైన ఒకానొక విశేషం మానవ మనుగడకూ, మంచితనానికీ అవసరమైన ప్రాణ తుల్యమైన పవిత్రభావం కనబడుతుంది. దానిని అతీతంగా ఉంచేరా అని చూడవలసియున్నది. ఆ మహదాశయంతో బాల సాహిత్యసృష్టి సాగిననాడు లోకకల్యాణానికి మంచిమార్గ మేర్పడుతుంది.

ఈనాటి పెద్దలను వేరుచేసే కార్యాలకు కారణమైన భావాలను ప్రతిపాదించే సాహిత్యం పిల్లలకు పనికిరాదు. "అందరొక్కటే" "అన్నీ- అందరూ క్షేమంగా బ్రతకా"లన్న భావం పెంపొందించే బాల సాహిత్య సృష్టి జరగాలి. ఉదాహరణకు— కులమని, మతమని, జాతియని, హెచ్చు లొచ్చులని మచ్చుకైనా పిల్లలకు బోధింపకూడదు. చిన్ననాటినుండి వారిని కార్యశూరులుగా తయారుచేయాలి గానీ, కర్మశూన్యులుగా, పరులపై ఆధారపడేవారిలా తయారు చేయకూడదు.

'అందరొక్కటేను' బంధ మొక్కటేను సుమ్మా, 'మనవలెనే అందరునూ మనవలెనూ అని నమ్మ'— అని వారికి ఉగ్గుపాలతో బోధించాలి.

మన పాఠ్యగ్రంథాల్లో ఇంకా పరిహరింపవలసిన విషయా లనేకమున్నాయి. ఏవో అలవాటుగా, ఆచారంగా వస్తున్నవని కొన్ని పాతభావాలను, విశ్వాసాలను, వర్ణ వర్గ ప్రసక్తిని అందులో తొంగిచూడనీయడం ఉచితంకాదు.

నేడు బడులు బడులుకావు. గుడీ, బడీ అమ్మ ఒడిగా మారితేనే శ్రేయం, ప్రియం చేకూరడం.

"అమ్మఒడి చదువులబడి, మా యమ్మఒడి నాకొక గుడి; అమ్మ నేర్పును ఒరవడి, దైవమ్ముకంటెను త్వరపడి. అమ్మయే నా సర్వము, ధైర్యమ్ము బలమూ గర్వమూ" అని ప్రతి బాలుడు ధీరుడై భావించుకో గలగాలి.

అంతేకాదు "బడికీగుడికీ తేడాలేదోయ్ భక్తి శ్రద్ధా ఒకటేనోయ్" అన్న విశ్వాసం వాళ్ళకు బాల్యంలోనే పాదుకొనాలి.

అద్భుతం, హాస్యం, చమత్కారం, యుక్తి, ఆలోచన ఇటువంటివి పిల్లల నాకర్షిస్తాయి. వీరం మితిమీరకుండా ఉంటే సరిపడుతుంది. కరుణకూ స్థానం ఉంది. స్థూలంగా చెప్పాలంటే పిల్లల్లో దౌర్బల్యాన్ని, గుడ్డి నమ్మకాన్ని పెంపొందించేది బాల సాహిత్యం కానేరదు.

దైవ విశ్వాసం, మత విశ్వాసం, రాజకీయ వాసనల ప్రవేశం బాలసాహిత్య ప్రాంగణంలో ఎంతవరకు సమంజసం, వాంఛనీయం అన్నది నిష్పక్షపాతంగా తేల్చుకోవాలి. పిల్లలసలు మతాతీతరాజ్యాలని మనం ముందు ఒప్పుకోవాలి.

ఏదో తెలియబడని శక్తిని నమ్ముకుంటే

అన్ని సుఖాలూ లాభాలూ కలుగుతాయన్న భావం పెద్దల్లో ఎంత తప్పో, పిల్లల్లో కలిగించడమూ అంతకు నూరింతలు తప్పు. మనిషిలో పెరగవలసింది జ్ఞానం, యత్నం, సద్బుద్ధీ.

బాల సాహిత్యం పిల్లల బుర్రల్లో కొన్ని మౌలికమైన భావాలను-ధైర్యం, నిజాయితీ, స్నేహభావం, త్యాగబుద్ధి, సేవాదీక్ష-ఇలాంటివి బలంగా నాటాలి. ఎన్ని కష్టాలూ ఆటంకాలూ వచ్చినా అనుకొన్న మంచిపనిని సాధించే పాత్రలు గల కథలు పిల్లల్లో శీలాభివృద్ధికి తోడ్పడతాయి. ధన సంపాదనావకాశం కోసం గాక గుణ సంపాదనావకాశం కోసం కృషిచేసే మార్గాలను మాటల్లో, మంచి పాత్రల ఉదాహరణల్లో చూపాలి.

అతి ప్రౌఢాలు, అన్వయ క్లేశాలు, ధ్వనులూ, వ్యంగ్యాలూ, అంతస్సంఘర్షణలు-ఇలాంటివి బాలసాహిత్యంలో కూడదు.

ఈ స్పూత్నిక్ యుగంలో పిల్లలు తెలుసుకోవలసినవి ఎన్నో ఉన్నాయి. ఆరోగ్యసంబంధమైన అందాలు వాళ్ళు చిన్నప్పటినుండీ తెలుసుకోవాలి.

ప్రపంచ పౌరులందరూ పిల్లల క్షేమాన్ని పవిత్ర కర్తవ్యంగా ఎంచి వారు చేయగల్గినదంతా చేసిననాడు పిల్లల జీవితాలు సుఖమయంగా ఆనందమయంగా ఉంటాయి. అదే బాలసాహిత్య ధ్యేయంకావాలి!

---

# చీకటి చిట్లింది

"కిరణ్"

ఫినిష్ !
నూరేళ్ళ జీవితంలో నాల్గో వంతు.

— ఎద్దులా ఎదిగాడు
మొద్దులా వున్నాడు
ఉద్యోగం సద్యోగం లేదు
వెధవ వూరంతా తిరుగుతాడు
ఎట్ సెట్రాలు....

గత మూడేళ్ళా
నేపథ్య సంగీతం
మా 'యౌవనం' మూవీకి !

బే ఆఫ్ బెంగాల్ పక్కనే వుంది
అయినా మా ఆశయాల అఖాతాలు
యింకెంతో లోతుంటాయ్
మా ఆశలు వుత్తుంగ తరంగాల్లా
పడి లేస్తుంటాయ్.

జపం 'మా పాలిటి' వరం
ముందుకే దూకుతుంది మా గుర్రం.

డామ్ ! కొద్దిగా 'సొల్లు' మాట్లాడటం
అలవాటయింది యీ మధ్య

ఏమయినా,
వ్యక్తిత్వం చిత్రానికి
రంగు దిద్దుకుంటున్నాం,
భవితవ్యపు రస్తాని
చదును చేయ పూనుకున్నాం,
శ్రమలోనే మాకు విశ్రాంతి
ఆ చెంతనే మా మనసుకు శాంతి.......

లేవరా-సబ్ కాన్షస్ నుండి స్కై వైపుకి-షిఫ్ట్ !
ఇలలోనూ
తూర్పునా చీకటి చిట్లింది
ఇక వెల్గు వెల్లువలా జారనుంది !

# క్రీ. శ. 2000 నాటికి జల సంక్షోభం?

## డా. చందు సుబ్బారావు

ప్రపంచంలో ఇటీవల సంభవించిన పెట్రోలు సంక్షోభంలాగే క్రీ॥శ॥ 2000 సం॥ నాటికి నీరు కరువై పోతుందా? తైలం, బంగారం, రేడియో ధార్మికలోహాలు నేటి నాగరికతకు పట్టుగొమ్మలు. కాని నీరు సర్వ జీవకోటికీ ప్రాణాధారం. నీరు భూమిపైన లభించటం అరుదైపోతే 'జల సంక్షోభం' అన్నింటికంటె దారుణమైన సమస్యవుతుంది. ఇప్పటికే కొన్నిచోట్ల కరువు కాటకాలతో ప్రజలు మాడిపోతున్నారు. అటు వ్యవసాయానికీ, ఇటు పారిశ్రామిక ప్రగతికీ నీరు మూలాధారం కావటంవలన ప్రపంచంలో ఒకచోట ఎంత ప్రగతి సాధించినా, మరో చోట ఆకలి చావు తప్పటంలేదు. సహకార సౌభ్రాతృత్వాలతో ఎగుమతి దిగుమతులు సల్పటానికికూడా వీలులేని మూలకం ఇది. కొండొకచో దప్పిక తీర్చలేని కొండంత సముద్రం ఉన్నా ప్రయోజనంలేదు. ఏ ధృవాలదగ్గరో గడ్డకట్టి అపారమైన జలాలు ఉన్నా - ఇవి 'కాశీలో కొబ్బరికాయ'ల వంటివి. మంచు గడ్డలను కరగించటానికి తడిసి మోపెడవుతుంది. నదులు వర్షా కాలంలోతప్ప నీటిని సరిపోయినంత దాచి వివిధప్రదేశాలకు పంపిణీ చేయలేవు. భూమి లోపల ఉన్న నీరు అనుకొన్నప్పుడు, అవసరమైనప్పుడు పైకిరాదు. అన్నింటికీ మూల విరాట్టయిన 'వర్షపాతం' ప్రాంతాలనుబట్టి, శీతోష్ణాలనుబట్టి మారుతుంటుంది.

భూగోళం మీాద వున్న నీటిలో 97% సముద్రాల్లో వుంది. మిగతా 3% నదులు, సరస్సులు, భూగర్భం, మంచుకప్పులు, ధృవ ప్రాంతాల్లో సర్దుకుంది. తిరిగి ఈ మూడు శాతంలో ఎక్కువ భాగం (నాల్గోవంతు) భూగర్భంలో దాగివుంది.

అయితే నేటి పరిస్థితినిచూస్తే కొన్ని హానికరమైన సూచనలు మినహా నీరు ఇంకా సంక్షోభ ఖనిజరూపం దాల్చలేదు. వాడకంలోనూ, వినియోగపద్ధతుల్లోనూ, ఎగుడు దిగుళ్ళు మినహాయిస్తే కావలసినంత నీరు దొరుకుతూనేవుంది. ఆ మాటకొస్తే క్రీ. శ. 2000 కాదు, 3000 కూడా భూమిపైన నీటికి కొరత రాదు. ఎక్కడో ఒకచోట నీరుంటూనే వుంటుంది. ఆ ఎక్కడన్నది సమస్య. ధృవాలదగ్గర నీరు శీతోష్ణమండలాలైన మన ప్రాంతాలకు చేరాలంటే లక్ష మిలియన్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి సాలీనా ఖర్చుపెట్టవలసి వుంటుంది. సహజంగా విద్యుచ్ఛక్తి జలవిద్యుత్ప్రాజెక్టులనుండితప్ప రాదు. నీరు లేందే విద్యుచ్ఛక్తిరాదు. విద్యుచ్ఛక్తి వలన నీటి సరఫరా అందుమూలంగా అనూహ్యం— అలాగే సముద్రపు నీటిని శుభ్రపరచటంకూడా. ఇవన్నీ జరిగినప్పుడు గ్లాసుడు మంచినీటి ఖరీదు, ఆపిల్ రసం ఖరీదుకు మించిపోతుంది. అదీ మనమనుకొనే సంక్షోభం. అయితే—

జల సంక్షోభం రాగలదని ఊహించటం కాదు. శాస్త్రవేత్తలు లెక్కేస్తున్నారు. సుప్రసిద్ధ సోవియట్ జల విజ్ఞానశాస్త్రవేత్త లొవోవిచ్ ఈ ప్రళయం జరుగుతుందని ఊహిస్తున్నవారిలో ప్రథముడు. అలాగే ప్రపంచం యావత్తూ నీటి వనరులమీాద తమ దృష్టిని కేంద్రీకరిస్తున్నారు. వారుగణిస్తున్న విషయాల్లో ముఖ్యాంశాలివి.

1) మనిషియొక్క సగటు వాడకం దినానికి 150 లీటర్లనుండి క్రీ॥ శ॥ 2000 నాటికి 400 లీటర్లకు పెరుగుతుంది.

2) ఆనాటికి పారిశ్రామిక ప్రగతి నేటి కంటే 15 రెట్లుంటుంది.

3) 2000 నాటికి ప్రపంచ జనాభా 6000 మిలియన్లకు చేరుతుంది.

4) వ్యవసాయం 5 రెట్లు పెరుగుతుంది.

5) పై విషయాలన్నీ పురోభివృద్ధి సంకేతాలు. మరో తిరోగమన సంకేతం ఉంది. అది కాలుష్యం. ఈనాడు మనం అవలంబిస్తున్న సాంకేతిక, సాంఘిక జీవ ధోరణులను ఇలాగే కొనసాగిస్తే మన నదులూ, కాల్వలూ మురికికాల్వలై ప్రవహించే ప్రమాదముంది.

ప్రగతికై కొత్త వనరులను సమీకరించుకునే మాట అటుంచి ఉన్న నీటిలో కాలుష్యం చేరి వాటి వినియోగస్థితిని కరగించే అవకాశం ఉంది. అందుచేత మొదటి 4 అంశాల ప్రాధాన్యత ఒకెత్తూ, చివరి అంశంయొక్క ప్రాముఖ్యత ఒకెత్తూ – అని భావిస్తున్నారు. ప్రపంచం మొత్తంమీద వివిధ రంగాల్లో వినియోగం నేటికీ, క్రీ. శ. 2000 నాటికీ ఎలా మారుతుందో పట్టికలో చూపబడింది.

పట్టిక

(నీటి వాడకం ఘన కిలో మీటర్లలో)

| రంగం | నేడు | క్రీ.శ.2000 |
|---|---|---|
| గృహావసతి, | | |
| మున్సిపాలిటీలు | 110 | 920 |
| పశుసంక్షేమం | 40 | 150 |
| విద్యుచ్ఛక్తి | 250 | 3,100 |
| పరిశ్రమలు | 200 | 3,000 |
| వ్యవసాయం | 2,500 | 4,250 |
| తోటలు, చెట్లు | | |
| (వ్యవసాయేతర) | 1,260 | 2,500 |
| కాలుష్యం | 5,580 | 37,600 |
| | (ఇదేరీతిన కొనసాగితే) | |
| మురికినీరు | 1220 | ? |
| మొత్తం | 11,160 | 51,520 |

ఇలా పెరిగిపోతున్న నీటి అవసరాలు, తరిగిపోతున్న వనరులమధ్య శాస్త్రీయకృషిని బట్టి కొంత సంక్షోభనివారణ కూడా సాధ్యమే ననిపిస్తుంది.

ఉదాహరణకు నేడు వెళ్ళిపోతున్న 1220 ఘ. కి.లో. మురికినీటిలోను 290 ఘ కి.మీ. నీటిని తిరిగి ఏదోవిధంగా శుభ్రపరచి వాడుతున్నారు.

అలాగే ఈనాడు వృథాగా సముద్రాల్లో కలిసిపోతున్న నదుల నీటినుండి కొంత దారి మళ్ళించి నిల్వ చేయటానికి యత్నిస్తున్నారు. ఆవిరైపోయే జలాశయాల్లో రసాయనాలు కలిపి నీరు అంతర్ధానం కాకుండా ఆపే ప్రయత్నం సాగిస్తున్నారు. సాధ్యమైనంత వరకు తక్కువ ఖర్చులో సముద్ర జలాన్ని శుభ్రపరచటానికి సన్నద్ధమవుతున్నారు. కాలుష్యం క్రూరదంష్ట్రల బారినుండిరక్షించి సద్వినియోగానికై అనేక జాగ్రత్తలు తీసుకుంటున్నారు. పట్టికనోసారి పరిశీలిస్తే మనకో విషయం సువిదితమవుతుంది. ఒక్క ఈ కాలుష్యాన్ని అరికడితేచాలు. జలసంక్షోభం నూ రేళ్ళు అవలకు వెళుతుంది. "మాంచెస్టర్ గార్డియన్" అనే పత్రికలో ఓసారి సంపాదకీయంలో ఇలా వ్రాసారట.

"భారతదేశంలో సన్యాసుల ఆధ్యాత్మిక చింతనమాటలా వుంచి వాహ్యాళికినే ప్రతి కాలవలోనూ, నదిలోనూ స్నానంచేయకుండా వుంటే మంచిది. ఎక్కడపడితే అక్కడ దొర్లి హుక్కాలు గంజాయిలు పీల్చి, ఉదయాన్నే అవన్నీ నీటిలో ఉమ్మేస్తున్నారు" అని.

నీటి విలువ ఎలాంటిదో మచిలీపట్నంలో కాకపోయినా మాచర్లలోనైనా గ్రహించవచ్చు. *

# ANAND SAFE COMPANY

Manufacturers :

**Steel Furniture, Almyrahs, Iron Safes & Sofa - Com Beds Etc ,**

Dealers : myfoam MATTRESSES - I ILLOWS - CUSHIONS

**Show - Room** :

Eluru Road - Governorpet

VIJAYAWADA - 520 002

*With the best Compliments from*

# INDIA BLOCK MAKERS

**First of its Kind in A. P.**

3-6-430/1 Liberty Road,
Himayatnagar,
HYDERABAD - 500 029

Ramarao Street
Gandhinagar,
VIJAYAWADA - 3
Phone : 72295

# ది కృష్ణా సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్

## హెడ్ ఆఫీసు: బందరు

స్థాపితము : 1915 ఫోన్ నెం. 530, 539

బ్రాంచీలు :– భీమవరం, కైకలూరు, ముదినేపల్లి, గుడివాడ, గుడ్లవల్లేరు, బంటుమిల్లి, చల్లపల్లి, అవనిగడ్డ, పామర్రు.

శ్రీ డి. ఏసుదాసు, యమ్. ఎ., హెచ్. డి. సి.,
స్పెషల్ క్యాటగిరి డిప్యూటీ రిజిష్ట్రారు - పర్సన్ యిన్‌చార్జి, ఫోన్ నెం. 730

ఆంధ్రప్రదేశ్‌లోని 26 కో-ఆపరేటివ్ బ్యాంకులలోకెల్ల మిన్న అని మన్ననలను పొందిన 'ఎ' క్లాసు బ్యాంకు. సహకార సంఘాలకు, రైతులకు, వర్తకులకు, యితర వృత్తిదార్లకు అన్ని విధములైన బ్యాంకింగ్ సౌకర్యములు సమకూర్చి గత 60 సం॥ ల నుండి సేవ చేస్తున్న బ్యాంకు.

అన్ని బ్రాంచీలయందు సేఫ్ డిపాజిట్ లాకర్ల సౌకర్యము కలదు. మరియు బంగారు వస్తువుల తాకట్టుపై అప్పు లీయబడు సంస్థ

ధనలక్ష్మి డిపాజిట్సు పథకము ప్రత్యేక ఆకర్షణ. మీరు వేయు డిపాజిట్లు వ్యవధిని బట్టి 34.72 శాతం బారువడ్డీ యిచ్చు సంస్థ.

: మా బ్యాంకులోని డిపాజిట్లులకు ఇన్సూరెన్సు కలదు :

| ధనలక్ష్మి డిపాజిట్టు పథకము క్రింద మీరు రూ. 1,000 లు డిపాజిట్టు చేసిన | | వడ్డీతో సహా వచ్చు మొత్తము | లెక్కకువచ్చు బారువడ్డీ | |
|---|---|---|---|---|
| 1. | సం. నకు | రూ. 1089 లు | 8.90 | శాతం |
| 2. | ,, | 1185 | 9.25 | ,, |
| 3. | ,, | 1327 | 10.90 | ,, |
| 4. | ,, | 1458 | 11.45 | ,, |
| 5. | ,, 1 నెలకు | 1704 | 13.87 | ,, |
| 6. | ,, | 1875 | 14.58 | ,, |
| 7. | ,, | 2080 | 15.43 | ,, |
| 8. | ,, | 2307 | 16.34 | ,, |
| 9. | ,, | 2559 | 17.32 | ,, |
| 10. | ,, | 2838 | 18.38 | ,, |
| 12. | ,, | 3489 | 20.74 | ,, |
| 15. | ,, | 4754 | 25.00 | ,, |
| 18. | ,, | 6472 | 30.40 | ,, |
| 20. | ,, | 7949 | 34.75 | ,, |

సి.హెచ్. నాగేశ్వరరావు, B.Com., H.D.C., సెక్రటరీ

డి. ఏసుదాసు, M.A., H.D.C., పర్సన్-ఇన్-ఛార్జి

సి. బి. వి. నరసింహం, B. Com.
డిప్యూటీ రిజిష్ట్రారు - ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

98

కవులకు, కళాకారులకు

రచయితలకు, సాహితీ మిత్రులకు

శుభాకాంక్షలు

శ్రీ రామ చిత్ర

మద్రాసు

కథానిక

# ఇది కథ కాదు

శ్రీ నందం రామారావు

శీతాకాలం కావడంవల్ల త్వరగానే చీకటి పడిపోయింది. ఏడుగంటలకే ఎంతో రాత్రయి నట్టుగా వుంది !

మాచమ్మ చేతి కర్ర ఆసరాతో కళ్ళు కనిపించక కుంటుకుంటూ నడుస్తోంది. ఆమె చేతిలో పళ్ళె మొకటుంది. ఆ పళ్లెం ఖాళీగా వుంది.

చలిగా వుంది. వీధిలైట్లు వెలగడంలేదు. సందులూ, గోతులూ; బురదగా, అసహ్యంగా వున్నాయి.

మాచమ్మ నెమ్మదిగా తడువుకుంటూ నడుస్తోంది. చలికి వణకిపోతోంది. శరీరం ముడతలుపడి, ఎముకలు కనిపిస్తున్నాయి. కట్టుకున్న నేతచీర చినిగిపోయింది.

చీకటిగా వుంది.

నడుస్తోంది. ఒకింటి ముందు ఆగింది. చేయి వణుకుతోంది. గొంతులోంచీ మాట పెగలడంలేదు. కడుపులో ప్రేవులు ఆకలికి మాడిపోతున్నాయి. "అమ్మా కాస్త అన్నం పెట్టు తల్లీ"

"పోవే. పో. వేళా పాళా లేదు"

"కాస్త అన్నం పెట్టు తల్లీ! నీకు పుణ్యముంటుంది"

"పోవే. నీక్కాదూ చెప్పేది?'

మాచమ్మ నిట్టూర్చింది. కదల్లేక కదల్లేక కలిదింది అక్కడ్నుంచి. కాళ్ళు తడబడుతున్నాయి. చలికి శరీరం గజ గజ వణుకుతోంది. గదిలో ఐస్ పరచి అందులో పడుకోబెట్టినట్లుగా వుంది! ఐనా, మాచమ్మ ఎలాగో నడుస్తోంది. నడవక తప్పడంలేదు!

ఓ సందు దగ్గరకొచ్చిఆగింది. ఆ సందంతా భీభత్సంగా వుంది. పాడైపోయిన రోడ్డును బాగుచేయడంకోసం, అక్కడంతా రాయి తోలబడి వుంది. గుంటలు. గుంటల్లో మురికి నీరు. ఆ మురికినీటిలో పందులు పోట్లాడు కుంటున్నాయి. ఒక కుక్కొకటి కుయ్యో కుయ్యో మంటూ అరుస్తోంది. భరింపరాని వాసనగా వుంది.

ఏదో ఇంటిలోంచీ ఎవరో బిగ్గరగా నవ్వుతున్నారు. మరో యింటిలోంచీ సినిమా పాటలు వినిపిస్తున్నాయి. ఎదురింటి లోంచీ పసిపాప గుక్కపెట్టి యేడుస్తోంది.

మాచమ్మ నడుస్తోంది.

"అమ్మా! కాస్త అన్నం పెట్టు తల్లీ! రెండురోజులనుంచి అన్నంలేదు.... అమ్మా"

ఆ యింటిలోంచి సమాధానం లేదు. అంటే, మనుష్యుల్లేరనికాదు, వున్నారు. వారంతా ఆనందంలో మునిగిపోయివున్నారు. ఆ యింటిలోపల ఎవరో, ఎవరిమీదనో 'జోక్' విసిరారు. నలభైయేళ్ళ స్త్రీ పమిట జారవిడుచుకుని మరీ నవ్వుతోంది. ఆవిడ కూతురుగారు ఎదురుగా కూర్చున్న 'హిప్పీ' స్నేహితుడిని కళ్ళతో కవ్విస్తోంది!

"అమ్మా! పొద్దున మిగిలిం దేదైనా వుంటే కాస్త అన్నం పెట్టు తల్లీ?" మాచమ్మ శక్తినంతా కూడతీసుకుని అడిగింది.

వారంతా స్వర్గానికి గజం దూరంలో వున్నారు. అంచేత ఆ పుణ్యాత్ములకి ఈ పాపపు ఆర్తనాదం వినిపించదు. ఒకవేళ వినిపించినా పలకూడదు!

చలి కొరికేస్తోంది. చేతులు కొంకర్లు పోతున్నాయి. కాళ్ళకు రాళ్ళు గుచ్చుకొని ప్రాణం పోయినట్టుగా వుంది. చెవుల్లో హోరుగా వుంది. కళ్ళు తిరుగుతున్నాయి. చాలాసేపు మాచమ్మ ఆ యింటిముందు ఆగింది. మూసివున్న ఆ యింటి తలుపులు తెరచుకోలేదు! మాచమ్మ అక్కడనుంచి భారంగా కదిలింది. అడుగుతీసి అడుగు వెయ్యలేకపోతోంది. రెండు రోజులనుంచీ అన్నం లేదు! మంచినీళ్ళు తాగి గడుపుతోంది. పని చేసుకుని చిల్లరడబ్బులు సంపాదిద్దామన్నా వీల్లేదు! చూపు స్పష్టంగా ఆనదు. కర్ర సహాయం లేనిదే నడవలేదు. ఇంకే విధంగా తనను తాను పోషించుకోగలదు? ఇల్లు లేదు! ఒకప్పుడుంది. అద్దెఇల్లు! కొడుకు పోవడంతో అదీ పోయింది.

మాచమ్మ పళ్ళన్ని పొట్టకు ఆనించుకుంది. అంతమాత్రాన ఆమె ఆకలి తీరదు!

తూలుకుంటూ తూలుకుంటూ నడిచి రోడ్డెక్కింది. లైట్ల కాంతిలో ఆ ప్రదేశమంతా పట్టపగల్లా వుంది. కార్లూ, జనం.... హడావుడి....

వేదికమీద ఒకాయన గంభీరంగా వుపన్యాస మిస్తున్నాడు— "ఈనాడు మన దేశం తీవ్రమైన సంక్షోభంలోవుంది. ఎటుచూసినా అల్లర్లూ, సమ్మెలు.... .... నిజమే! ఈనాడు మనం కష్టాల్లో వున్నాం. ఐతే, ఈ కష్టాలు కలకాలం మనకు వుండవ్. నేను వచ్చే నెలలో సాంస్కృతిక వుత్సవాల్లో పాల్గొనడానికి విదేశాలు వెడుతున్నాను. అక్కడ వారి సాంప్రదాయాలనూ, వారి పద్ధతులనూ అవగాహన చేసుకుని........"

గుంపులోంచి ఎవరో అంటున్నారు— "అయ్యా! ఇప్పుడు మాకు కావలసింది మీ విదేశ పర్యటన కాదు. మనదేశంలో ప్రజలు సుఖంగా వుండడం. అదాలోచించండి"

నాయకుని వుపన్యాసం దీర్ఘంగా సాగుతోంది.

జనం చప్పట్లు కొడుతున్నారు. అయ్యావారు మెళ్లోవున్న దండలను చేత్తో సవరించుకుంటూ నవ్వుకుంటున్నాడు.

మాచమ్మ ఆ వుపన్యాసం వింటూ ఆకలి మరచిపోయింది! ఆ నాయకుడు ఎవరో కూడా గుర్తు పట్టగలిగింది. అప్రయత్నంగా మాచమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. బావురుమని యేడ్వాలనిపించింది. చినిగిపోయిన చీర చెంగుతో కళ్ళు వత్తుకుంది.

సరిగ్గా సంవత్సరం క్రితం—

ఇక్కడ-ఇదేవేదికమీద-అసంఖ్యాకమైన జనసమూహంలో వేదికపూవ బిక్కు బిక్కుమంటూ మాచమ్మ కూర్చునుంది. ఆమె మెడనిండా పూలదండలు, ప్రజల జయ జయ ధ్వానాలు. ఇంతమంది జన సమూహంలో, ఇప్పుడు వుపన్యాస మిస్తున్న నాయకులే ఆనాడు మాచమ్మను పొగుడుతూ యిలా అన్నారు— "మాచమ్మ ధన్యజీవి. ఆనాడు దేశ స్వాతంత్ర్యంకోసం ఎందరో మహానుభావులు ప్రాణాలర్పించారు. ఈనాడు మాచమ్మ కుమారుడు, మన వుద్యమానికి అండగా నిలచి సి. ఆర్. పి. ఘాతుక చర్యలకూ, తుపాకీ గుండుకూ బలై ప్రాణా లర్పించాడు. నిండా ఇరవై సంవత్సరాలు నిండని ఆ బాలుడు నేలకొరిగాడని తెలియగానే నాప్రాణం తలడిల్లిపోయింది. ఏది ఏమైనా, మన లక్ష్యం మనం సాధించి తీరుతాం. ఈనాడు మన సమాజానికి కావలసింది మాచమ్మల్లాంటి తల్లులే.

కుమారుడు పోయాడని శోకించక, మనం సాధించబోయే విజయానికి తన కుమారుడు బలై పోయాడని తెలిసి ఆ మహాతల్లి సంతోషించింది. దేశానికి యిటువంటి వీరవనితలే కావాలి....''

అప్పుడు మాచమ్మ శరీరం గగుర్పాటు చెందింది. సంతోషంతో ఆనందభాష్పాలు రాలాయి!

కొడుకు ప్రతిరోజూ రిక్షా లాగి తల్లిని పోషించేవాడు. ఒక చిన్న పాకలో అద్దెకు వుండేవారు. రిక్షాతోలితే రోజూ నాలు గైదు రూపాయలు గిట్టేది. ఆ డబ్బుతో బియ్యం, పప్పులూ, ముసలితల్లికి మందులూ తెచ్చేవాడు.

ఆ వయస్సులో మాచమ్మకు, కొడుకు కొండంత అండగా వున్నాడు. తల్లికి ఏమాత్రం నలతగా వున్నా, తల్లిదగ్గరే కూర్చుని సపర్యలు చేసేవాడు.

చిలికి చిలికి గాలివానలా వుద్యమం తీవ్ర రూపం దాల్చింది. ప్రజాజీవితం స్థంభించి పోయింది. కార్లూ, రైళ్ళూ, విమానాలూ ఆగిపోయాయి. వార్తాపత్రికలనిండా వుద్యమాన్ని గురించే. నాయకులు సింహాల్లా గర్జించారు! శపథాలు చేశారు! మాచమ్మ కొడుకు నాయకుల ఉపన్యాసాలకు పొంగి పోయాడు. తనూ వుద్యమంలోకి వురికాడు. అహోరాత్రులు కృషిచేశాడు. ఆందోళనలకూ, అలజడులకూ నగరంలో 144 సెక్షన్ విధించారు.

వారం రోజులనుంచీ కొడుకు రిక్షా తొక్కడంలేదు. భోజనంలేదు!

ఒకనాటి సాయంత్రం— కొడుకు యింటికి వస్తూవుండగా బజారులో వుద్యమకారుల నినాదాలు ప్రారంభమైనాయి. ఎటుచూసినా జనప్రవాహం. సి. ఆర్. పి. బలగమొచ్చింది. విజిల్స్.... లాఠీలూ.... తుపాకులూ....జనం భయంతో పరుగెడుతున్నారు. కొంతమంది నినాదాలిస్తున్నారు. లాఠీఛార్జీ.... భాష్ప వాయువు.... ధన ధన తుపాకీల మ్రోత .... ఎంతోమంది ఆ నడిబజారులో ప్రాణాలు వదిలారు! అందులో మాచమ్మ కొడుకు ఒకడు.

మృతవీరుల సంస్మరణార్థం పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేశారు. ఆనాటి సభలో మాచమ్మను వేదిక నెక్కించి — గతం కళ్ళ ముందు కనుమరుగైపోగా మాచమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి!

మాచమ్మకు వున్న ఒక్క కొడుకు అండా పోయింది. బ్రతుకు దుర్భరమయింది. గడవడం కష్టమైపోగా, తన ఒక్క పొట్టకోసం అడుక్కోవడం మొదలుపెట్టింది.

వుద్యమం ఆగిపోయింది. ఇప్పుడు మాచమ్మ నాయకుని మీటింగ్ వింటోంది.

చలి వూచి వూచి కొడుతోంది. వణికి పోయింది. చినిగిన చీరను నిండా కప్పుకుంది. ఐనా, చలి శరీరాన్ని తాకకుండా వుండడం లేదు. కర్ర ఆసరాతో, మరో చేత్తో ఖాళీ పళ్ళాన్ని పట్టుకుని నిలబడింది.

రోడ్డుమీద బహిరంగసభ అయిపోయింది. జనం వెళ్ళిపోతున్నారు. నాయకుడు వేదిక దిగి కారు దగ్గరకు వచ్చాడు. చుట్టూ అనుయాయులు అంగరక్షకులుగా వుండి అయ్యవారికి వినయంగా దారిగా చూపిస్తున్నారు. మాచమ్మ అటువేపుగా నడిచింది. అయ్యవారిని పలుకరించాలని నాలుగడుగులు వేసింది. దుమ్మును లేపుకుంటూ కారు వేగంగా ముందుకు దూసుకుపోయింది. ఆ వెనుక మరికొన్ని కారులు.

రోడ్డుమీద ఇంతక్రితంవున్న కోలాహాలం లేదు. త్వరత్వరగా జనం యిళ్ళకు వెళ్ళి

పోతున్నారు. మాచమ్మ నిట్టూర్చింది. ఇక నడవలేక ఆయాసంతో ఒక అరుగుమీద కూర్చుంది. కడుపులో పేగులు మెలికలు తిరుగుతున్నాయి. ఆకలికి తాళలేకపోతోంది. పంపుదగ్గర కాసిని మంచినీళ్లు తాగుదా మను కుంది. చలికి వేళ్ళు బిగుసుకుపోతున్నాయి. చర్మం మాడిన పెసరట్టులా ఎండిపోయింది. అరికాళ్ళు మండుతున్నాయి. ఇక లాభం లేదు, ఈ రాత్రికి ఎక్కడో ఒకచోట ఇంత అన్నం సంపాదించాల్సిందే.

మాచమ్మ లేచింది. కర్రను టక టకా ఆడించుకుంటూ, చూపు ఆనని దృష్టితో తడువుకుంటూ యింటింటికీ తిరుగుతోంది. ఎక్కడా ఒక్క మెతుకుకూడా దొరకలేదు! చివరి ప్రయత్నంగా— తూలుకుంటూ, వణుకుతూ ఒక డాబా ముందాగింది. పళ్లాన్ని ముందుకుచాపి—"అమ్మా! అన్నపూర్ణమ్మ తల్లీ!" కంఠం వణుకుతోంది.

ఆ డాబాలోనుంచి ఏ సమాధానం లేదు! కొన్ని క్షణాలు.... మళ్ళా ఆ చలిని భరిస్తూ కుంటూ— "అమ్మా! ఆకలికీ,చలికీ తట్టుకో లేకపోతున్నాను కాస్త అన్నం పెట్టి పుణ్యం కట్టుకో తల్లీ"- మాచమ్మ దీనంగా అర్థించింది. ఎవరూ పలకలేదు.

ఆ వీధి నిర్మానుష్యంగావుంది. సందు చివర కరెంటు స్థంభం గుడ్డిగావుంది. ఎక్కడా ఏ విధమైన సందడీ లేదు.

నిముషాలు గడుస్తున్నాయి.

చివరిప్రయత్నంగా, శక్తినంతా కూడ దీసుకుని మాచమ్మ దీనాతిదీనంగా— "అమ్మా! అన్నంపెట్టు తల్లీ!"

భళ్లున ఆ డాబా తలుపులు తెరచు కున్నాయి. సింహంలా భయంకరంగావున్న ఒక పెద్దమనిషి బయటకొచ్చాడు. హోదా గల ఆ అధికారికళ్ళు కాగడాల్లా వున్నాయి. మనిషి తూలిపోతున్నాడు. "ఏమే, ఎందుకా అరుపులు? వెళ్ళు వెళ్ళు" ఖరీదైన విస్కీ వాసన.

"బాబూ! రెండు రోజులనుంచీ అన్నం లేదు. కాస్త అన్నం పెట్టించు బాబూ"

"నీక్కాదటే చెప్పేది.... వెళ్ళు"

"బాబూ! ఇవేళ అన్నం తినకపోతే చచ్చిపోతాను. మీ కాళ్ళు పట్టుకుంటాను. అమ్మగారితో చెప్పి...."

"ఎన్నిసార్లే నీకు చెప్పేది"

"బాబూ! కాస్త దయతలచి ఈ ముసలి దానికి...." బండబూతులు కూస్తూ బలమైన బూటుకాలు మాచమ్మ రొమ్ములోతగిలింది. చేతిలోవున్న కర్ర దూరంగా, పళ్లెం మరో ప్రక్క పడిపోయాయి. మట్టిలోనుంచీ లేవాలని ప్రయత్నించింది. రొమ్ములో తగిలిన బలమైన దెబ్బ పోటుగా వుంది. ఆ చీకటిలో కర్ర ఎక్కడపడిందో తెలియలేదు. ఆ ప్రాంత మంతా చేత్తో తడివింది. ఆమె చేతికి కర్ర దొరకలేదు! కడుపులో పేగులు వుండలు చుట్టుకుపోతున్నాయి. శరీరం మెలికలు తిరుగుతోంది. కళ్ళల్లోనుంచి నీళ్ళు కారు తున్నాయి.

ఆ డాబా తలుపులు కొంచెంగా తెరచు కున్నాయి. లోపలనుంచి ఒక అందమైన యువతి ఆచ్ఛాదనంలేని శరీరంతో బయటకు తొంగిచూసింది. హోదాగల ఆ పెద్దమనిషి కోసం ఆతృతగా ఎదురు చూస్తోంది. ఈ రాత్రికి ఆ ఎలుగుబంటితో గడిపితేనే, తెల్లారి ఆమెకు వుద్యోగంవచ్చేది! లేకపోతే కథ మామూలే! తల్లినీ, తమ్ముళ్ళనూ, చెల్లెళ్ళనూ పస్తులుంచాల్సిందే!

మాచమ్మ బాధగా మూలిగింది.

"ఇంకా ఇక్కడున్నావేం. లే.... లేచిపో"

'బాబూ! నేను........' మాచమ్మ మాట పూర్తికాకుండానే, మరోసారి బూటుకాలు కర్కశంగా తగిలింది.

అంతే — మాచమ్మ మరి లేవలేదు! చిన్న ఆర్తనాదం చేసి నేలను అంటుకు పోయింది.

చలిగాలి వీస్తూవుంది. కొన్ని నిముషాల క్రితం చలికీ, ఆకలికీ అలమటించిపోయిన మాచమ్మను, ఇప్పుడా చలీ, ఆకలీ ఏమీ చెయ్యడంలేదు!

తెల్లవారింది. జనమంతా ఎవరిపనుల్లో వారు మునిగిపోయారు. మాచమ్మ శవం ఆ సందులో అలాగే పడి వుంది! కుక్కలు ఆశగా పొంచి చూస్తున్నాయి.

రెండు రోజులు గడిచాక—

'మాచమ్మ అనే ముసలావిడ చలికి తట్టుకోలేక చచ్చిపోయింది' — అని పేపర్లో ఒక మూలగా చిన్నవార్త పడింది!

---

" జీవితం సంగీతం పెట్టెమీద చిగురుటాకు అంగుళులను కదలనీ
పలుకుతుంది హిందోళ – ఒలుకుతుంది నవహేల
అప్పుడు – బ్రతుకే ఊగే ముత్యాలఉయ్యాల ! "

— తిలక్

---



105

# రచయితలు - ప్రచురణకర్తలు

—శ్రీ భావరాజు నరసింహారావు

"....కిము ధనై ర్విద్యానవద్యా యది"
"... సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్ ?"

".... దోషరహితమైన విద్య ఉంటే సకల భోగసాధనకు వేరే ధనము లక్కర్లేదు. ....మంచి కవిత్వం ఉంటే సకల లోకులను వశం చేసుకోవడానికి రాజ్యం అక్కర్లేదు"- అన్నాడు ప్రఖ్యాత ప్రాచీనకవి భర్తృహరి. అంటే సుమారు రెండు వేల సంవత్సరాలనాటి నుంచీ నేటివరకూ కవులకు— అంటే రచయితలకు — అటువంటి గౌరవస్థానం భరత ఖండంలో ఉంటున్నదని మనకు అర్థం అవుతున్నది.

ఇంత విశిష్టస్థానం రచయితలకు ఉండటం సహజమూ, న్యాయమూకూడా. ఎంచేతనంటే నూతన వికాసానికి కావలసిన ప్రధాన ద్రవ్యం విద్య.

"విద్య నిగూఢ గుప్తమగు విత్తము, రూపము పూరుషాళికిన్ ....విద్య నెరుంగని వాడు మర్త్యుడే ?" పద్యం మనకు తెలుసు. అల్లాంటి సద్విద్యను అందరికీ ప్రసాదించేవాడు కవి—అంటే రచయిత.

పూర్వం రచయితలకు రాజాదరణ ఉండేది. భుక్తికోసం పుస్తకాలు వ్రాసి అచ్చువేసుకొని అమ్ముకోవలసిన అవసరం వాళ్ళకు ఉండేదికాదు. ఈనాడు రాజులు లేరు. రచయితలు రాజాదరణ పొందే అవకాశంలేదు. రాజుల స్థానంలో ప్రజలు ప్రభుత్వాన్ని నడిపిస్తున్నారు. రచయితలను కూడా కొంతవరకు ఆదరిస్తున్నారు. అయినా రచయితలు జీవయాత్ర సాగించడానికి ఏదో ఒక వృత్తిని అవలంబించక తప్పటం లేదు. ఆ వృత్తిని చేసుకుంటూ తీరిక ఉన్నప్పుడు రచనలు చేస్తున్నారు. నూటికీ, కోటికీ ఎవరో ఒకరు తప్ప రచయితయైన ప్రతివాడూ కేవలం రచనే వృత్తిగా జీవయాత్ర చేయడం ఈనాడు సాధ్యం కావడంలేదు.

ప్రఖ్యాత రచయితల పుస్తకాలు బాగా అమ్మకం అయి, తనకు లాభం వస్తుంది కనక ప్రచురణకర్త వాళ్ళ రచనలు పబ్లిష్ చేస్తాడు. కొత్త రచయితల పుస్తకాలను పబ్లిష్ చెయ్యడానికి సాధారణంగా పూనుకోడు. అందువల్ల రచయిత అప్పో సప్పో చేసి స్వంత ఖర్చుమీదనే తన రచనలను పబ్లిష్ చేస్తాడు. కాని రచయితే ప్రచురణకర్తగా వ్యవహరిస్తే చాలా చిక్కులున్నాయి. పుస్తకాలు ఒక్కసారిగా విడుదల కావు. ఒక్కొక్కప్పుడు అసలు విడుదలకాకుండా వందల ప్రతులను ఏళ్ళతరబడి చెదలు పట్టకుండా కాపాడుకోవలసిన స్థితి కూడా రచయితలకు కలుగుతూ ఉంటుంది. అథవా అడపా దడపా కొద్ది కాపీలు అమ్ముడుపోయినా ఆ వచ్చిన డబ్బు ఎప్పటి కప్పుడు ఏవో చిల్లర ఖర్చులక్రింద వినియోగం అయిపోతుంది. పుస్తకాలు అచ్చు వేయించడానికి అయిన అప్పు అలాగే ఉండిపోతుంది.

అంతే కాదు. రచయితవద్దకు వచ్చిన స్నేహితులూ పెద్దమనుషులూ అతని రచనలను గురించి నాలుగు మంచిమాటలు చెప్పి, అతణ్ణి పొగుడుతారు. రచయిత సహజంగా తన రచనలను గురించి మంచి మాటలు విన

కోరుతాడు. ఆ మాటలు చెప్పినవాళ్ళకు తన పుస్తకాలను ఉచితంగా యివ్వడం ఉచిత మనుకుని, వెంటనే వాళ్ళకు ఎంతో ఔదార్యంతో పుస్తకాలను అభివందనాలతో బహూకరిస్తాడు. ఇలాంటి శ్రేయోభిలాషులు ఎంతమంది ఎన్ని పుస్తకాలను సంగ్రహించారో గుర్తుంచుకొన్నట్లయితే చివరకు రచయిత గుండెలు బాదుకుంటాడు.

రచయితే పబ్లిషరయినప్పుడు కలిగే బాధల నుంచి తప్పించుకోవడానికి తన రచనల్ని ప్రచురణకర్తల ద్వారా పబ్లిష్ చేయిస్తాడు. అలా చేసేటప్పుడు సరసుడూ, నమ్మకస్తుడూ అయిన ఒక్క పబ్లిషరుద్వారానే తన రచనలన్నిటినీ విడుదల చేయటం మంచిది. లైబ్రరీలూ, బుక్ సెల్లర్లూ ఒక రచయిత పుస్తకాలను కొనేటప్పుడు ఒకే పబ్లిషరు దగ్గరనుంచి తెప్పించుకుంటారు. అలా చేస్తే వాళ్ళకు పుస్తకాలు త్వరగానూ, తక్కువ ఖర్చుతోనూ చేరుతాయి. ఎక్కువమంది ప్రచురణకర్తలద్వారా పబ్లిష్ అయితే, ఒక్కొక్కప్పుడు కొన్ని రచనల విషయం లైబ్రరీలకు గుర్తు కూడా ఉండక పోవచ్చును. జాగ్రత్తగా ఆలోచించుకుని ఒక పబ్లిషరుని నిర్ణయించుకున్న తరువాత అతనితో అన్ని విధాలా రచయిత సహకరించి పరస్పర ప్రయోజనానికి కృషి చేయాలి.

పబ్లిషింగు వ్యాపారం, చాలామంది అనుకునేటంత, తేలికైనది కాదు. "అది ఒక పని వృత్తి మాత్రమే కాదు, అది ఒక కళ" అని రేమాండ్ మార్టిమన్ మహాశయుడు అన్నాడు పబ్లిషరుగా జీవితం ప్రారంభించడం తేలికే గాని, పదికాలాలపాటు మనగలగటం బహుకష్టం. పబ్లిషరుకు కొంత విద్యావ్యాసంగం ఉండాలి. తనకు కావలసిన పుస్తకం ఏ రచయిత వ్రాయగలడో గ్రహించాలి. ప్రింటింగు, బ్లాక్ మేకింగు, బైండింగు మొదలైన సాంకేతిక విషయాలు తెలిసి ఉండాలి. కేవలం విషయం మాత్రమే తెలిసి ఉండటం కాకుండా కొంత అభిరుచి, కళాదృష్టి, మంచి 'టేస్ట్' కూడా ముఖ్యంగా ఉండాలి.

వీటన్నిటికన్నా ముఖ్యమైన పని — పబ్లిష్ చేసిన పుస్తకాలను అమ్మటం ఎలాగో నేర్చి ఉండాలి. ఫెలిక్స్ డాన్ అనే జర్మన్ దేశస్థుడు ఆ విషయమై ఏమంటున్నాడో చూడండి; "పుస్తకాలను వ్రాయటం తేలికే; అందుకు కావలసినవి కాగితం, కలం, సిరా. కష్టమైన పని పుస్తకాన్ని అచ్చు వేయటం. కష్టతరమైన పని అచ్చు అయిన పుస్తకాన్ని చదవటం. (పుస్తకాన్ని పట్టుకోగానే నిద్ర వస్తుంది కనక!) కష్టతమమైన పని పుస్తకాలను అమ్మటం." అందులోనూ మంచి పుస్తకాలను అమ్మటం మరీ కష్టం. డిటెక్టివ్ నవలలూ, సెక్సు కథలూ అమ్ముడైనంత ఉత్తమకావ్యాలు విడుదల కావన్న సంగతి మన కందరికీ తెలిసినదే!

అదేమి పాపమో కాని పుస్తకాలను కొని చదివేవాళ్ళు అన్ని దేశాలలోనూ తక్కువే. అందులో మన ఆంధ్రదేశంలో మరీ తక్కువ. "చేతనైతే పుస్తకాన్ని ఉచితంగా సంపాయించాలి. అవసరం అయితే దొంగిలించాలి. విధిలేకపోతే పుస్తకాన్ని కొనాలి — ఇదీ సాధారణంగా మావాళ్ళ అభిప్రాయం' అని ప్రఖ్యాత బ్రిటిష్ పబ్లిషరు సర్ స్టాన్లీ అన్విన్ సెలవిచ్చాడు.

పబ్లిషింగు వ్యాపారం విజయవంతంగా జరగటానికి రచయితా, ప్రచురణకర్తా, ముద్రాపకుడూ, చిత్రకారుడూ, పుస్తక విక్రేతా, గ్రంథాలయాలూ — వీళ్ళందరూ సమష్టిగా కృషి చేయాలి. ఇందులో ప్రథమ

స్థానమూ, ప్రధానస్థానమూకూడా రచయితది. రచనను ఆధారం చేసుకునేకదా మన వాళ్ళందరూ పని చేయగలగడం? అందువల్ల రచయితకు కొంత స్వేచ్ఛ యివ్వాలి. రచయిత ఆర్థికస్థితి అతని మనస్సుమీదా, రచన మీదా కూడా ముద్ర వేస్తుంది. ఈ విషయంలో పబ్లిషరు మెలకువతోనూ, ఉదారంగానూ వ్యవహరించాలి. రచయితకు న్యాయంగా రావలసిన డబ్బును సకాలంలో అందచేస్తూ ఉండాలి. రచయిత అనే ఫల వృక్షాన్ని ప్రేమతో పెంచి, ఫలాలను అనుభవించే తోటమాలిగా పబ్లిషరు ఉండాలి.

కేవలం భుక్తికోసమే తను పుస్తకాలు వ్రాస్తున్నా ననుకొనక, తన రచనలు భావి తరాలవారిని ఉత్తేజపరచి ఉత్తమపౌరులుగా తీర్చి దిద్దవలసి ఉన్నదనీ, అందువల్ల తాను సంఘ శ్రేయస్సుకు బాధ్యుడననీ రచయిత మరిచిపోకూడదు. తనవిధిని తాను నిర్వహించి నప్పుడు ప్రజలు తనను గౌరవిస్తారనికూడా రచయిత గుర్తుంచుకోవాలి.

పబ్లిషరు కేవలం ధనార్జనకే వ్యాపారం చేస్తానన్నట్లయితే, రోగనివారణతో నిమిత్తం లేకుండా తన ఫీజుకోసం మాత్రమే వృత్తిని చేబట్టిన డాక్టరుతో సమానం అవుతాడు. ధన సంపాదన ఒక్కటే ధ్యేయం అయితే పబ్లిషింగు వ్యాపారం చేయకూడదు. ఎంత మంచి పుస్తకాలను ప్రచురిస్తే అంత లాభం వస్తుందని పబ్లిషరు గ్రహించాలి. పబ్లిషింగు వ్యాపారం లక్షలు ఆర్జించటానికి అవకాశం యివ్వకపోయినా, కోట్లకు విలువైన ఉత్తమ సంఘ సేవకు దోహదం చేస్తుంది. ఉత్తమ కావ్యసృష్టి చేసే కవిబ్రహ్మ సన్నిహిత సాంగత్యమూ, ఉత్తమగ్రంథ ప్రచురణవల్ల ప్రజాబాహుళ్యానికి జ్ఞానజ్యోతిని నిరంతరాయంగా అందచేయ గలగటమూ ఎంత అదృష్టం! పబ్లిషింగు వ్యాపారం ఉత్తమ శ్రేణికి చెందిన ప్రజాసేవ!

ఇటువంటి ఉదాత్త సేవకు సమాన భాగస్వాములైన రచయితలూ, ప్రకటన కర్తలూ—విద్దెల తల్లి అయిన శారదాదేవి అనుంగు కవల బిడ్డలు. భాషాసేవాదృష్టిలో పరస్పర సహకారంతో తమ బాధ్యతలనూ, ధర్మాన్నీ గుర్తెరిగి, తమ విధులను సక్రమంగా నిర్వహిస్తే రచయితలూ, ప్రచురణకర్తలూ తమ్ము తాము ఉద్ధరించుకోవటమే కాకుండా ఉత్తమ దేశసేవ చేసినవారుకూడా కాగలరు!

---



అన్నిమిల్లుల
వస్త్రాలను
అందరికీ
అందుబాటులో
ఉండే ధరలకు
అందజేయగల
అధునాతన
షోరూమ్!
కామధేను
టెక్స్‌టైల్ కాంప్లెక్స్
బీసెంట్ రోడ్, విజయవాడ-2.
PHONE:62420.

శుభాకాంక్షలతో

బొగ్గరం అచ్యుతశర్మ B. Com.,

జీవితభీమా ఏజంటు

సేల్సుటాక్సు ప్రాక్టీషనర్

ప్రకాష్‌నగర్, నరసరావుపేట

(గుంటూరుజిల్లా)

శుభాకాంక్షలతో

పూదోట పాల్‌రాజా B. Sc.,

జీవితభీమా ఏజంటు

సర్పంచ్ , రావిపాడు

నరసరావుపేట, గుంటూరుజిల్లా

శుభాకాంక్షలతో

మట్టుపల్లి నాగేశ్వరరావు

శ్రీ వెంకటేశ్వరా మెడికల్స్

నాగులుప్పలపాడు

ప్రకాశం జిల్లా

" రేపటి వసంతానికి ఈనాటి అవసరం జీవిత భీమా "

రెడ్డి నరసింహారావు

జీవితభీమా ఏజంటు

నరసరావుపేట

గుంటూరు జిల్లా

# నిత్య జీవితంలో హాస్యం

## శ్రీ పుచ్చా పూర్ణానందం

వ్యాధిగ్రస్త కళేబరాలతో, శాపగ్రస్త జీవితాలతో సవాలక్షసమస్యలతో సతమతమై మూర్ఛిల్లే మానవాళికి హ్యూమరోపతి సంజీవని వంటిది. నవరసములలో హాస్యం సరసీరుహం. గుడిసెలోని ముదుసలినీ గుడిలోని దేవుడినీసైతం పకపక నవ్వించే శక్తి హ్యూమరాలజీ యిస్తుంది. సర్వాన్నీ నవ్వేయగలవాడే ఇహపరాలకి పైవాడు. హాస్యం సర్వరోగ నివారిణి. బిలీఫ్ వుండాలే గాని రిలీఫ్ గ్యారంటీ. నవ్వేది, నవ్వబడేదీ మానవుడేగా. కనుక హాస్యదృష్టి వుంటే, నిత్యజీవితంలో తారసపడే సన్నివేశాలలోంచి సరసమైన హాస్యం సృష్టించవచ్చు. గడ్డిపోచ మొదలు గాడ్ వరకూ హాస్యపదార్థమే. రచయితలూ, రీడర్సూ సెన్సుఆఫ్ హ్యూమరు డెవలప్ చేసికోవాలి. హాస్యం నిఖార్సైన అద్దాల మహల్. అందులో ప్రవేశించితే అన్ని యాంగిల్సులో నిన్ను నీవు చూచుకోవచ్చు. గుడ్సూ బాడ్సూ నీలో నీవే నవ్వుకోవాలి. అప్పుడే నీ ప్రతిబింబాలు నీతో పాటు నవ్వుతాయి. Laugh when you meet Misfortune and pass on to Victory- ఆనందసౌధ నిర్మాణానికి హ్యూమరిస్టులు Sole Contractors

ఆడాళ్లూ మగాళ్లూ ఉత్తర దక్షిణ ధ్రువాలు. అయినా పెళ్ళాడ్డానికి వీళ్ళు చాలా అవసరాలుగదా. కావ్యంలోనైనా కాపురంలోనైనా ధ్వని ఉండాలి. సంసారం అన్యోన్యంగా చేసుకుంటూనే చాకచక్యంగా సంసారపక్షంగా కలసి కలహించవలె. పగలు సెగలు రాత్రి వగలు. ఇంతలో కీచులాట, అంతలో కిస్సులాట. మాటకుమాట నీటుగా అననేర్చిన ఇల్లాలితనమే ఇల్లాలితనం. మూగతనం, ముంగితనం, మొద్దుత్వం, మొరటుతనం తగదు. సతీపతులు ఉభయులూ హాస్యకుశలురైతే Hell ను Heaven గా మార్చగలరు.

ఒకామెతనపుట్టినరోజు రేపనగా పెనిమిటికి డిమాండ్సు లిస్టు యిచ్చేసరికి చిందులూ శివాలూ వేస్తూ తలప్రాణం తోకకు వచ్చిందన్నాడు. సరే, ఆ మర్నాడు ఉదయంపట్టుపట్టి తలంటికి వొప్పించింది గృహలక్ష్మి. కాస్టర్ ఆయిల్ ను క్రమంగా గృహమేధి పుర్రె బ్లాటింగ్ పేపరులా పీల్చే అదను కనిపెట్టి ఆరువందలు కావాలంది అర్ధాంగి. ఇహ అర్ధాంగుడు "అరవిందదళాయతాక్షీ ఆరు వందలేకదా, శాంక్షన్డు, శాంక్షన్డు, గ్రాంటెడ్ గ్రాంటెడ్" అనేశాడు మాడుమీదపడుతున్న తాళయుక్తమైన దరువులమధ్యలో. మనీ స్వీకరిస్తూ, 'తోకప్రాణం తలకువచ్చినట్లుందే స్వామీ' అంటూ కొంటెచూపు చూసింది.

ఓ పెద్దమనిషి గావుకేకపెట్టి వైఫ్‌ను పిలిచి "బెర్నార్డుషా ఏమన్నాడో తెలుసా? A woman likes a hot chilly and a harsh husband; కారంగల మిరపకాయ కఠినచిత్తుడైన భర్త ఆడదానికి ఇష్టమట". "అవునండీ దేవా నాకూ కొరివికారంపై ప్రీతి; మరి, మరో మగడుకాదు, నా పాలిటి యముడు, అయినా మిమ్మల్ని ఒక్కక్షణం ఒదలి వుండలేను" అంది ఆమె. 'సరే వెళ్లు, పనిచూస్కో, తెల్సిందా' అన్నాడుధీమాతో. ఈభాగ్యానికి బెర్నార్డుషా సపోర్టుఎందుకండీ, ప్రత్యక్షంగా తమరు చాలరూ" అంటూ బుగ్గమీద చిటికెవేసి లోనికి వుడాయించింది.

భోజనానికి కూర్చోబోతూ "కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, రూపేచ లక్ష్మీ, క్షమయా దరిత్రీ, భోజ్యేషు మాతా, శయ

నేషు రంభా, షట్కర్మయుక్తాకిల ధర్మపత్నీ" అని ఒహాయన పైకి స్మరిస్తూ, అమ్మవుండగా అడిగి కడుపునిండా పెట్టేది అనుకున్నాడు. భోజనంమధ్యలో గృహిణి దిక్కులుచూస్తూ. ఏమిటా తింటం, నీళ్లుకారుతూ, మానేన భోక్తవ్యం అన్నాలముందు కబుర్లెందుకు, చకచక తిను" అని సాగించింది. ఏమిటా ఏక వచన ప్రయోగం, అని తన నిరసన తెలిపాడు. 'భోజ్యేషు మాతా' అని తమరే సెలవిచ్చారుగా, మీల్సు టైంలో మీకు మాతృ మూర్తిని, పాపాయీ, మర్యాదలేంటి కురాళ్ళిడా, మదర్ హోదా వెలిగిస్తున్నా' అని విరగబడినవ్వింది.

ఓయింట ఆడపిల్లల్ని అత్తారింటికి పంపి మగడూ పెళ్ళాం తలుపు దగ్గరకేసి తీరికగా మూడుగంటలు వాగ్యుద్ధం చేసారు. పెంకులు లేచేట్టు అరుచుకున్నారు. తమ పెళ్ళికి ముందు చూపుల లగాయితు, యీమధ్య మామగారు అవసరానికి డబ్బు సర్దకపోవటం వరకూ కలహపదార్థం సమృద్ధిగా దొరికింది యిద్దరికీ. చుట్టుపక్కలవాళ్ళు వచ్చి చూరు కింద నిలబడ్డారు. చనువున్న వాళ్ళు తలుపునెట్టి, పండంటి కాపురం పాడుచేసుకోవద్దని మొసలికన్నీటితో సలహాలిచ్చారు. వాళ్ళు వినిపించుకోక యింకా జోరుచేశారు సివిల్ వార్. అయిదు కాగానే యిద్దరూ వాకిట్లోకి వచ్చారు. ఆమె యింటికి తాళం వేసింది అతను రిక్షా తెచ్చాడు. యిద్దరూ నిక్షేపంలా వూరేగుతూ సినిమాకు చక్కాపోయారు. మధ్యలో ఫూల్సు అయిన వారిలో వో పండితుడు "అజాయుద్ధే, ఋషిశ్రాద్ధే, ప్రాభాతే, మేఘడంబరే, దంపత్యోఃకలహే, బహ్వారంభో లఘుక్రియః" అని గీర్వాణంలో వాపోయి మేకల యుద్ధంలా, ఆలుమగల తగాదాలో ఆర్భాటం జాస్తి, క్రియ తక్కువ అని విపులీకరించాడు.

ఓ బిల్డింగ్ వోనరుకు టర్మగాంట్ భార్య వుంది. ఆమె నాలుక వాడికి వేడికి యే కొనేంటూ నిల్వలేకపోతున్నాడు. ఓమారు వో పెద్ద ఆఫీసరుడ్ని యిరవయ్యో నెంబరులో బాంబార్డు చేస్తున్నది. అతను ఓనర్ కేసి దీనంగాచూస్తూ "మీసమక్షంలో యింతేసి మాటలంటుంటే మీరు చూస్తూ ఊరుకుంటా రేమిటండి"అని అప్పీలు చేశాడు, "అయ్యా మీరు మూడు నెలలకే భరించలేకపోతిరే- నా మాటేమిటి, పదమూడేళ్ళనుంచీ బాధ పడుతున్నా, నే నెవరితో చెప్పుకోను? నేను యీయింట్లో న్యూటర్ జెండర్ను"అన్నాడు. వెంటనే కొనెంటు తెనిగించి 'అయ్యా నపుంసక లింగంగారూ, వెకేట్ చేస్తున్నా' అంటూ ఖాళీచేశాడు. అది లగాయతు ఆ బోటి నోటికి తాళం పడ్డది.

ఓ బుక్ సెల్లర్ వోకాయన్ని విజ్ఞాన సర్వస్వం కొనమని అడిగితే తనకు భార్య వుండి ఆక్కర్లేదన్నాడు. నిజమే పెళ్ళాన్ని చదివితే, అన్నీ ఆకళింపు అయినట్లే.

"ఏమండీ యింట్లో యింత రాక్షసంగా వుంటారు, ఏటా యింక్రిమెంట్లు యెలా వస్తున్నాయండీ మీకు" అని వోకామె హజ్బెండును అడిగింది. నావద్ద సమ్మోహనాస్త్రం వుందోయ్. ఎవరూ లేకుండా చూచి మా మేనేజరు కాళ్ళు పట్టేస్తా. మనయింట్లో హాల్డాకూడుగానీ, ఆయనకి వారం వారం బట్టలు సప్లయిచేస్తా. నిన్నకాక మొన్న అతని విధవ అత్తగారికి మల్లుఫోవతులు సమర్పించా అంటూ తన ప్రతాపం వెల్లడించాడు. ఓ, నా పిల్లలతండ్రికి బ్రతుకు తెరువు తెలుసన్న మాట. తమరు కాకాసురులా? ఉద్యోగం ఊడినా ఫర్వాలేదు. కాకాయిజం ట్యుటోరియల్ స్కూలు పెట్టుకోవచ్చు, అని ఆమె చమత్కరించింది.

"కాశీకి వెళ్ళి సరిగంగ స్నానంచేద్దాం" అని కాంతామణికి భర్త ప్రపోజు చేశాడు. ఎందుకండీ, వృథాఖర్చు, పదేళ్ళు ఓపికపడితే గంగను గోదావరితో కలుపుతారు; రెండూ వచ్చి కిష్టలో పడ్తవి. పావలా పారేస్తే సిటీ బస్సులో వెళ్ళి, బ్రిడ్జిదగ్గర మున్గితే సరి. పొదుపు నేర్చుకోండి, ప్రాణవల్లభా" అంది. ఇంతమారాలోచన తట్టలేదుసుమీ, అంటూ సతీమణికి కాంప్లిమెంటు చెల్లించాడు.

డాక్టర్ల రోగుల మధ్య సంభాషణల్లో హాస్యం చిందుతూ వుంటుంది. డాక్టర్ — ఒక్కమారు నోరు తెరవండి. రోగి: మీరే నయమండి! ఇంట్లో మా ఆవిడ నన్ను ఎప్పుడూ 'నోరు ముయ్యండి' అంటుంది. ఒక పేషెంటు 'రోగం నాలుగురోజుల్లో నయమవుతుం దన్నారు, నాలుగు వారాలైనా తగ్గలేదేమండీ' అని అడిగితే, ఇండియన్ పంక్చ్యుయాలిటీలెండి అని జోక్ విసిరాడు. మా వూళ్ళో వో నాటువైద్యు డుండేవాడు, త్వరగా రావాలి, సంధ్యగుణంలాగుంది, అని వాళ్లు ఆదుర్దాగా వస్తే, 'అయ్యా లొక్కోక, పీక్కోక, వెక్కిరించక ఎలా పోతుందయ్యా నిండుప్రాణి' అని నిబ్బరంగా సమాధాన మిచ్చేవాడు సదరు భిషక్కు.

సృష్ట్యాదినుంచీ పరమలోభులు, నికృష్టుడు, షైలాక్, అజగళస్తనము మామన్ వర్షిప్పర్, నిగ్గర్డు, మలభక్షకుడు క్లోజ్‌ఫిస్టెడ్ యిలాంటి బిరుదనామములతో విరాజిల్లుచున్నారు. రెండు డిగ్రీలవాడు, నాలుగు లకారాలవాడూ అయిన వో మైజర్ స్వర్గీయ గోవిందరాజు సుబ్బారావుగారిని కన్సల్టుచేస్తే ఫ్రూట్ డయటు తీసికోమని సలహా ఇచ్చాడు. అప్పుడా పరమపాపి తెగించి మార్కెట్‌లో బేరమాడి అర్ధణాపెట్టి ఏసెడు నక్కదోసకాయలు కొని ఆరగించాడు. ఇహ చెంబు క్రింద పెట్టలేదు. మర్నాడు వెళ్ళి తనకు ఫ్రూటు పడలేదన్నాడు. సేవించిన ఫ్రూట్ ఏమిటో అని అడుగగా 'దోసఫలములు' అని సగర్వంగా చెప్పాడు. సుబ్బారావు గార్కి వొళ్ళుమండి 'డబ్బుతగలేసి అలాంటి శాస్త్రీ పండ్లజోలికి పోకండి, సలీసులోవచ్చేవి, విభూతిపండ్లు, తలపండు, కుంకుడిపండు. బచ్చలిపండు వగైరాలు సమృద్ధిగా తీసికోండని వ్యంగంగా చీవాట్లు పెట్టాడు. మరో తృణమయ కృత్రిమపురుషుడు వడగాడ్పుల్లో నడుస్తూ పీకెండి, వీక్ మూమెంటులో సోడా త్రాగి "హా విశ్వేశ్వర, హాతోస్మి, దస్ పైసా గాన్" అని పదిరోజులు విలపించాడు. ఓ పిసినికొట్టు తనయింట్లో శుభకార్యానికి అరడజను లడ్లు అద్దెకు తెచ్చి వచ్చిన గెస్టుకి దర్శనభాగ్యం కలుగజేసి సరుకు భద్రంగా రిటర్ను చేశాడు. ఇంకో లుబ్ధాగ్రేసరుడు పోస్టేజికి దమ్మిడీ ఖర్చు పెట్టలేదు జన్మలో. సెంటర్లలో, స్టేషనులో నిలబడి యెరిగివున్న మనుష్యులద్వారా లిఖితవాగ్రూపకములైన కబుర్లు పంపేవాడు. లోభులు జితేంద్రియులు. కోర్కెలను చీల్చి, రుచుల్ని చెండాడి, దర్జాలను పాతిపెడ్తారు. మా మిత్రుడొకాయన స్వంతఅగ్గిపెట్టెతో చుట్టముట్టించనని గాయత్రిమీద ఒట్టుపెట్టుకొని శపథం నెగ్గించుకున్నాడు.

నాల్గు దశాబ్దాలకిందట వో మిత్రుడికి కళత్రం పోతే అదరించటానికి వెళ్ళాం. అతను ఇంగ్లీషులో ఏడ్చాడు. Oh, what a wife, I never beat you, you never wept, I may marry a second wife. what about children, pollution, polution, bad star, what about jadies all the pickles gone …….. ఇదీ వరస! ఏడ్వాలో నవ్వాలో మాకు బోధ పడింది కాదు.

ఒక బెంచికోర్టు ప్రెసిడెంటుకి prostitute కు ఎంత జరిమానా వెయ్యాలో తేలక లేడీ మేజస్ట్రేటును అడిగాడు. అందరితోపాటు 'కంకర్' అంది. "అది కాదండీ, ఆడముద్దాయి కదా, మీ kith and kin" అన్నాడు. ప్లీడర్లు నవ్వారు. Nuisance cases లో case-property produce చేయలేదేమిటి అని Police వాళ్ళను ప్రశ్నించేవాడు.

పూర్వం ఒక తాలూకాబోర్డు ప్రెసిడెంటు ఇంజనీరుగారికి కాలవకట్టలు చూపుతూ There are several తుమ్మ trees on the other side and పుదర్ side of the canal. The school is నిర్మాణీయోటెడ్ in 1923 in the చింతల్ తోప్" అని తెల్గిష్‌లో అనర్గళంగా దంచేశాడు.

చింతపేల, హాస్యం మీ సొంత సుండగ ! Laughter Movement లేవదీస్తున్నాం ; నవ్వుల Banks తెరుస్తాం; నవ్వు లోభులకు Free swans అమావాస్య రాయళ్లు పూర్ణచంద్రవదను లవుతారు. హాస్య వ్యవసాయం చేస్తే సంసారంలో some సారం పిండగలరు. నిత్య జీవితంలో Earthly Paradise దర్శిస్తారు. సినిక్సు సన్నిక్సుగా మారి తీరుతారు. స్వర్గం తాళంచెవి హాస్య దేవత చేతిలో ఉంది.

The sketch about 'What is Fun' is the funniest !

# కృష్ణాజిల్లా తెలుగు రచయితల మహాసభలు - నివేదిక

శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి

జిల్లాలోని తెలుగు రచయితలను (రచయిత్రులను) ఒక వేదికమీద సమావేశపరచి, పరస్పర పరిచయం, అవగాహన, సాధక బాధకాలను చర్చించి, సముచిత నిర్ణయాలను తీసుకోవడం ప్రాతిపదికగా కృష్ణాజిల్లా తెలుగు రచయితల మహాసభలు ప్రారంభించబడ్డాయి.

8–I–1967 ఆదివారం చక్కటి హేమంత గాలులు గిలిగింతలు పెట్టేవేళ విజయవాడ రైస్ మిల్లర్సు హాలులో ఆంధ్రజ్యోతి సంపాదకులు ప్రముఖ రచయిత శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారిచే ప్రప్రథమ మహాసభలు ప్రారంభింపబడ్డాయి. ఈ మహాసభలు ఒక్కరోజే జరిగాయి.

1968 మార్చి 10, 11 తేదీలలో ద్వితీయ మహాసభలు విజయవాడ శ్రీరామమోహన్ లైబ్రరీ మేడమీద హాలులో రెండు రోజులు జరిగాయి. అప్పటి రాష్ట్ర జన సంబంధ శాఖామాత్యులు గౌ॥ శ్రీ కొండా లక్ష్మణ బాపూజీగారు ప్రారంభించారు. శాసన సభ్యులు శ్రీ టి. వి. యస్. చలపతిరావుగారు అధ్యక్షత వహించారు.

అనివార్య కారణాలవల్ల 1969 లో తిరిగి మహాసభలు జరపడం పడలేదు. అయితే 1970 జూన్ 27,28 తేదీలలో గుడివాడ కవిరాజ కళామందిరంలో రెండురోజులపాటు తృతీయ మహాసభలు జరిగాయి. కవిసామ్రాట్ డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు ప్రారంభించారు.

అప్పటికే రుతుపవనప్రభావం చూపించడంతో, పెనుగాలికి, వర్షానికి వేదిక, మండపము కూలిపోవడంతో, స్థానిక శ్రీ బాలాజీ థియేటరులో ప్రారంభోత్సవం, ఆధునిక కవితాసదస్సు నిర్వహింపబడ్డాయి. శ్రీ ఆరుద్ర యీ సదస్సుకు అధ్యక్షత వహించగా, శ్రీయుతులు సోమసుందర్, గజ్జెల మల్లారెడ్డిగార్లు ప్రసంగించారు. ఈ సదస్సు శ్రీ M. V L. నిర్వహించారు.

తర్వాత కార్యక్రమాలు కవిరాజ కళామందిరంలో పునర్నిర్మించబడ్డ వేదికపై నిర్వహింపబడ్డాయి

తొలిరోజు మధ్యాహ్నం జరిగిన కవితా గోష్ఠిలో ఆహూతులైన సదస్సులు పెక్కుమంది పాల్గొని తమ తమ కవితా పాటవాన్ని ప్రదర్శించారు.

సాయంత్రం జరిగిన నవలా సదస్సులో శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య, శ్రీ హరికిషన్‌లు ప్రసంగించారు. నాటక సాహిత్య సదస్సుకు డా॥ వి. శ్రీనివాసశాస్త్రి అధ్యక్షతవహించారు. శ్రీయుతులు నండూరి సుబ్బారావు, శంకరమంచి సత్యంగార్లు ప్రసంగించారు. శ్రీ సుమన్ యీ సదస్సు నిర్వహించారు.

ఆనాటి రాత్రి చిరంజీవి సవితాల మాణిక్యాంబ లలితసంగీత కార్యక్రమముతో, చిరంజీవి దూబగుంట నాగలక్ష్మి నాట్య ప్రదర్శనతో ప్రేక్షకులకు మనోరంజకం గావించారు.

మర్నాడు ఉదయం జరిగిన అనువాద సాహిత్య సదస్సును ప్రధాన కార్యదర్శి శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి ప్రారంభించారు. గుడివాడ ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ వై. వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు కె. బసవేశ్వరరావు, గోపరాజు సాంబశివరావు, మల్లాది సూరిబాబుగార్లు ప్రసంగించారు. ఈ సదస్సును శ్రీ కె. వి. ఏ. రామశాస్త్రి నిర్వహించారు.

ప్రచురణలపై జరిగిన సదస్సులో శ్రీ P. C- జోషి, శ్రీ M V. సుబ్బారావుగార్లు ప్రసంగించారు. శ్రీ M V L. యీ సదస్సు నిర్వహించారు.

మధ్యాహ్నం జరిగిన ప్రతినిధుల సభకు డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి నిర్వహించారు.

కథాసాహిత్య సదస్సులో శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య, శ్రీ విహారి ప్రసంగించారు. ఈ సదస్సును శ్రీమతి శోభనాదేవి నిర్వహించారు.

ఆనాటి రాత్రి శ్రీయుతులు నండూరి సుబ్బారావు, శ్రీ రామమోహనరావు బృందంచే "దొంగాటకం" నాటిక ప్రదర్శించబడింది.

• ప్రధాన కార్యదర్శి వందనసమర్పణతో తృతీయ మహాసభలు ముగిశాయి. *

# ఆగమ సంగీతం

శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్ (కల్పనాచటర్జీ)

నా కళ్ళల్లో—
ఆవేదన రగిల్చిన ఉద్రేకాల సరస్సులు,
ఉరితీయబడుతున్న అక్షరాలు!

నా కళ్ళల్లో— నయాగరాలు,
కూలిపోతున్న అరటిచెట్లు బారులు, బారులు!

విషాదం రంగు ఏమిటో చూడాలంటే
నా కన్నీళ్ళతో పరిశోధన చేయండి!

నా కాళ్ళకు సంకెళ్ళు; నా చేతులకు సంకెళ్ళు;
నా నోటికి సంకెళ్ళు; నా బ్రతుక్కే సంకెళ్లు —
నేను కదలడం లేదు,
బలవంతాన కదిలిస్తున్నారు:
బండల క్రింద కప్పలా చేస్తున్నారు!

నే నెవరో చూస్తారా? — చూడండి —
కలవారి మోచేతి నీళ్ళల్లో నే నున్నాను;
బానిసత్వాన్ని భరిస్తున్న కంకర్రాళ్ళల్లో నే నున్నాను

ఇప్పు డిప్పుడే —
గుండెలో తెగిపోయిన
ఆశాకాంతుల్ని అతికించుకుంటూ
విషాద విశ్వాస గీతిక పాడుకుంటూ
గతం పులుముకున్న అక్రమాల్ని దులుపుకుంటూ
లక్ష్యశుద్ధితో గమ్యంకేసి నడక మొదలెట్టాను

ఇప్పుడు — నా కళ్ళ వెనుక,
ఒక మహత్తర సందేశం వెలుగుతోంది,
ఒక కలగీతం సెలయేరుగా సాగుతోంది!!

కవిత

# మన మేకులం?

"నవ్యకవి" శ్రీ నాదెళ్ళ

ఈ 'కాకాల' లోకంలో
మన మేకులం ?
ఏకులం, మేకులం
మనం కవికులం.

ఇరువైపులా పదునైన కత్తి
అదే మనకున్న మేధాశక్తి!

మంచికి మంచిని పంచుతాం
చెడుకి చెడు చూపించుతాం
మించుతాం, సంఘాన్ని ఒంచుతాం
ఏకు మేకని నిరూపించుతాం!

అందుకే మనమంటే
సంఘంలో వ్యాకులం
మనం చాకులం; బాకులం!

బుద్ధికి సూదులం
కవితకు ఏకులం
నిజానికి మేకులం
మనం కవికులం
మనదంతా ఒకే కులం!!

సాహితీమిత్రులకు అభినందనలు

కనిందుల హనుమంతరావు B. Sc,

జీవితభీమా ఏజంటు

సాతులూరు - గుంటూరు జిల్లా

రచయితల మహాసభలకు

శుభాకాంక్షలతో

డాకా పున్నారెడ్డి

జీవితభీమా ఏజంటు

రాష్ట్ర (వయా) అమ్మనబ్రోలు, ప్రకాశంజిల్లా

153

# మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| * | 1. | స్పందన ( కవితాసంకలనం ) | రు. 1-00 |
| * | 2. | త్రివేణి ( కవితాసంకలనం ) | 1-00 |
| * | 3. | వానచినుకులు ( కథలు ) శ్రీమతి డి. కామేశ్వరి | 2-00 |
| * | 4. | మనిషికోసం ( కవితాసంపుటి ) గుత్తికొండ సుబ్బారావు | 2 00 |
| | 5. | ప్రబుద్ధ భారతం ( కావ్యం ) బూదరాజు శ్యామసుందర్ | 2-00 |
| | 6. | కవిత ( సంకలనం ) డా॥ సి. నా. రె – డా॥ దాశరథి etc. | 2-00 |
| | 7. | వికాసం ( తెలుగుసంస్కృతికి కవితాంజలి ) | 2-00 |
| * | 8. | జవాబులేని ప్రశ్న ( కవిత ) కె. యోగేశ్వరరావు | 2-00 |
| * | 9. | రాగలహరి ( నవల ) విజయమూర్తి | 5-00 |
| | 10. | తరతరాల తెలుగు వెలుగు ( నృత్యగేయ రూపకం ) డా॥ సి. నారాయణరెడ్డి | 3-00 |
| * | 11. | ఆంధ్ర చంపూరామాయణము శ్రీ రొంపిచర్ల కృష్ణశాస్త్రి | 10-00 |
| | 12. | శిలలో సెలయేరు ( కథలు ) విహారి & శాలివాహన | 4-00 |
| | 13. | వినరా సుమతీ ( సుమతిశతక వ్యాఖ్య ) డా వి. వి. యల్. నరసింహారావు | 2 00 |
| * | 14. | ఊరు విక్కిలు చెప్పింది ( కథలు ) శీలా వీర్రాజు | 4-00 |
| | 15. | స్మృతి ( నవల ) శ్రీమతి అక్కల సరస్వతీ బాబూరావ్ | 4-00 |

( * గుర్తుగల పుస్తకాలు ప్రతులు లేవు )

స్పందన సాహితీ సమాఖ్య (రిజిష్టర్డ్)
23/182 ఇ, న్యూమునిసిపల్ క్వార్టర్స్
మచిలీపట్టణం-521001

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.V.PDGA129 | Date | 23/10/2020 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | 18, 22, 32, 34, 36, | | |
| Missing Pages | NO | | |
| Prepared | Lakshmi | Scanned | K. Daveed |
| BOOK SIZE | H - 10 W 7.5 | Pages | 167 |